# పరిశోధన పద్ధతులు


డాక్టర్ ఆర్వీయస్. సుందరం

రీడర్, తెలుగు శాఖ, ఐ.కె.యస్.

మైసూరు విశ్వవిద్యాలయం.




రజతోత్సవ ప్రచురణ


యువభారతి

రిజిస్టర్డ్ నం. 1/64

తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

PARISODHANA PADDHATULU : (Methods of Research or Research Methodology- by Dr. R.V.S. Sundaram, M.A., Ph.D., Reader in Telugu, Manasa-gangotri. Mysore University, Mysore.

---



యువభారతి

(రజతోత్సవ సంవత్సరం 1990)

ప్రచురణ : 128

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1990

ప్రతులు : 1200

ముఖచిత్రాలంకరణం : శ్రీ శీలా వీర్రాజు

**వెల : రూ. 15-00**

ముద్రణ :

**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**

హైదర్‌గూడ, హైదరాబాదు-500 029

ముఖచిత్ర ముద్రణ :

**నందినీ ఆర్టు ప్రింటర్స్**

3-5-98/3, రాజ్‌మొహల్లారోడ్,

హైదరాబాదు 500 029

ప్రతులకు :

**యువభారతి కార్యాలయం**

**ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు**

**తిలక్ రోడ్, హైదరాబాదు-500 001**



# యువభారతి

## రజతోత్సవాహ్వానం

సమాజంలో సాహిత్య చైతన్యాన్నీ, సాహిత్య సదవగాహననూ పెంపొందించి, ఉత్తమ సాహిత్యాన్ని సహృదయులకు అందించటంలో కడచిన ఇరవై అయిదేళ్ళుగా యువభారతి దీక్షతో కృషి చేస్తున్నది. '1990' యువభారతి రజతోత్సవ సంవత్సరం. ఈ యేడాది పొడుగునా విశేష కార్యక్రమాలను, సాహిత్య ప్రచురణలనూ సహృదయులకు సమర్పిస్తున్నది.

మనకున్న అపారసాహితీ సంపదను సమకాలీన చైతన్యస్పృహతో సమీక్షించుకోవడం ప్రతి తరం చేసే పని. కడచిన పాతికేళ్ళుగా యువభారతి సమాజంలో ఉత్తమ ప్రమాణాలతో కూడిన సాహితీ స్పృహను కల్పించటానికి ఎన్నో ప్రయోగాలు చేసింది. లహరీ ఉపన్యాస వ్యాస పరంపర, రచన, మహతి లాంటి యుగ సమీక్ష గ్రంథాల ప్రచురణ యువభారతి ప్రత్యేకత.

ఈ పాతికేళ్ళలో యువభారతి ప్రజల కందుబాటులో ఉండే సాహిత్య రచనలను 124 ప్రచురించింది. రజతోత్సవ సంవత్సరంలో మరో 25 ప్రచురణలను అందించాలని ఆశిస్తున్నది. యువభారతి సాగించే ఈ సాహిత్యోద్యమంలో పాలు పంచుకోవటానికి 'భారతీభూషణ', 'భారతీమిత్ర', 'సాహితీమిత్ర' పథకాలు ఉన్నాయి. సహృదయులందరికీ ఇదే మా ఆహ్వానం: రజతోత్సవ సమాహ్వానం!

ఎం.ఏ., అయిపోగానే ఎం.ఫిల్.,లోనో, పిహెచ్.డి.లోనో చేరి విశ్వవిద్యాలయాలలో పరిశోధన చేసే యువ పరిశోధకులకు పరిశోధన పద్ధతులను గురించి పరిచయంచేసే రచన నొకదానిని రూపొందించాలనే యువభారతి సంకల్పానికి ఒక ప్రామాణిక గ్రంథంగా ప్రాణం పోశారు డాక్టర్ ఆర్వీయస్. సుందరంగారు. వారు వస్తుతః కవి; మంచి అధ్యాపకుడు; ఉత్తమ పరిశోధకుడు; శతాధికవ్యాస కర్త; అన్నింటికీమించి మనస్వి. సుందరంగారి రచన సర్వత్రా సరళసుందరం. వారికి యువభారతి కృతజ్ఞతాభివందనం. సకాలంలో అందంగా ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, ముఖచిత్రాలంకరణం చేసిన మిత్రులు శ్రీ శీలావీర్రాజుగారికి కృతజ్ఞతలు.

జి. వి. సుబ్రహ్మణ్యం

అధ్యక్షుడు

# విషయసూచిక



• చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది •



# పరిశోధన పద్ధతులు

డా॥ ఆర్వీయస్. సుందరం

## ప్రవేశిక

విశ్వవిద్యాలయాలలో బహుముఖంగా సాగుతున్న పరిశోధన సదభిరుచితో, సక్రమంగా, నిర్దుష్టంగా కొన్ని పద్ధతులకు అనుగుణంగా జరగాలి. అంతర్జాతీయ ప్రమాణాల ననుసరించి పరిశోధన జరిపే విద్యార్థి ఏ ప్రాంతానికి వెళ్ళినా, ఏ దేశానికి వెళ్ళినా ప్రామాణిక విద్వాంసుల దృష్టిని ఆకర్షిస్తాడు. అనన్యకృషితో అందరినీ మెప్పించగల్గుతాడు.

ప్రకృతగ్రంథంలో 'పరిశోధన' అంటే 'ఏదోఒక పరిశోధన' అని అర్థం కాదు. అపరాధ పరిశోధన, పరమాణు పరిశోధన, జీవాణు పరిశోధన వంటి మాటల్ని మనం వింటూఉంటాం. ఇక్కడ 'పరిశోధన' పరిమితార్థంలో వాడబడింది. విశ్వవిద్యాలయాలలో ఏదైనా విషయాన్ని స్వీకరించి, సమగ్ర పరిశోధన గావించి, సిద్ధాంతవ్యాసాన్ని తయారుచేసి సమర్పించాలంటే అనుసరించాల్సిన పద్ధతు లేమిటి అన్నదాన్ని ఈ గ్రంథంలో వివరించడం జరిగింది.

ఈ అనంత విశ్వంలో ఏ అణువైనా సమగ్రపరిశీలనకు, పరిశోధనకు అనువైందే. అలాగే నేడు విశ్వవిద్యాలయాలలో జరుగుతున్న పరిశోధనకు ఒక పద్ధతిని ఏర్పరచడం కూడా అత్యంతావశ్యకమైందే. ఈ గ్రంథం ముఖ్యంగా తెలుగులో పరిశోధన చేసే విద్యార్థులకోస మని వేరే చెప్పనక్కరలేదు. ఇతర పరిశోధకులు కూడా తెలుగు భాషద్వారా పరిశోధనను గూర్చి తెలుసుకోగలిగితే ఇంకా సంతోషమే. ఒక్క తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించినంత వరకే సుమారు ఏడువందలమంది ఇంతవరకు పిహెచ్.డి., లను, ఎం.ఫిల్., డిగ్రీలను

పొందారు. ఈ సంఖ్య త్వరలోనే వెయ్యినికూడా మించుతుందనడంలో సందేహం లేదు. కొన్ని వందలమంది తెలుగులోనే పరిశోధన చేస్తుండగా, తెలుగునాట మొత్తం పశోధకుల సంఖ్య కొన్ని వేలుంటుంది. ఇంతమందికోసం ఇప్పటికే పరిశోధననుగూర్చిన గ్రంథా లనేకం వచ్చిఉండాల్సింది. ఈ లోటును తీర్చడానికి కాకున్నా, నాకు తెలిసిన కొన్ని విషయాలను ఆసక్తికల పరిశోధకులతో పంచుకోవాలన్న ఆంకాంక్ష మాత్రమే ఈ గ్రంథం రూపుదిద్దుకోడానికి మొదటికారణం.

ప్రతి విషయంలోనూ మంచీ, చెడ్డా ఉన్నట్లే తెలుగులో జరిగిన, జరుగుతున్న పరిశోధన విషయంలో కూడా మంచి - చెడ్డల్ని గుర్తించవచ్చు. నన్నయ నుంచి నారాయణరెడ్డిగారి వరకు కవులు రాసిన కావ్యాల నన్నిటినీ విద్యార్థులు కవులకు తీసుకున్నారు. బాగా సేద్యం చేసిన వాళ్ళు చేశారు, నాగలి పట్టలేని వాళ్ళు కూడా కర్షకుల వేషం వేశారు. కొన్ని విశ్వవిద్యాలయాలలో సిద్ధాంత వ్యాసం తయారుచేసే ముందు కొంత శిక్షణపొందే అవకాశాలు కూడా ఉన్నాయి. కాని, అనేక విద్యార్థులు సిద్ధాంత వ్యాసాలను తయారుచేసేటప్పుడు కనీస మర్యాదల్ని, ప్రమాణాల్ని పద్ధతుల్ని అనునసరించడంలేదు. వీటి కన్నిటికీ కారణాలేవైనా, అందుబాటులో కొన్ని శాస్త్ర గ్రంథాలైనా ఉంటే తెలుగులో పరిశోధన మరికొంత మెరుగుపడుతుందేమో అన్న ఆశ కూడా ఈ గ్రంథ రచనకు మరొక కారణం.

'తెలుగు పరిశోధనం తీరు తెన్నుల'ను సమీక్షిస్తూ డా॥ వెల్చేరు నారాయణరావుగారు కొన్ని ముఖ్య విషయాలను ప్రస్తావించారు (అభ్యుదయ - విమర్శ విశేష సంచిక). ఇవి తెలుగులో పరిశోధనకే కాక ఇటీవలి కాలంలో పరిశోధన క్షేత్రంలోనే పడిపోతున్న ప్రమాణాలకు అన్వయిస్తాయి. డా॥ వెల్చేరు తమ వ్యాసంలో పేర్కొన్న ముఖ్యవిషయా లివి :

1. విశ్వవిద్యాలయాల పరిశోధన పత్రాలు నిర్దిష్ట ప్రమాణాలను అందుకోలేక పోతున్నాయి, నెలకొల్పలేక పోతున్నాయి.
2. మనది ఉద్వేగ ప్రధాన ధోరణి, అభిరుచి ప్రధాన ధోరణి.

3. మన రచనా పద్ధతుల్లో ప్రాథమిక శిక్షణ కూడా లేకపోవడం బాగా కనిపిస్తుంది.
4. సరైన ప్రమాణాలను చూపక పోవడం, నిరాధార విషయాల సాధారణీకరణ.
5. అనవసరమైన సమాచారాన్నంతా పోగు చేయడం.
6. సైద్ధాంతిక నైపుణ్యం లేకపోవడం, ప్రామాణికత లేకపోవడం, పాఠ విమర్శ చేసే ధోరణి లోపించడం.

పై అభిప్రాయాలను తెలుగు పరిశోధకులందరికీ అంటగట్టడం న్యాయ సమ్మతం కాదు. ఏ ప్రమాణాలతో చూచినా, కొలిచినా అత్యుత్తమ సిద్ధాంత గ్రంథాలు తెలుగులో వెలువడ్డాయి. అయితే డా॥ వెల్చేరుగారి అభిప్రాయాల్ని సూచనలుగా గ్రహిస్తే ఉత్తమ సిద్ధాంత గ్రంథాలు వెలువడడానికి దోహదం చేస్తాయని మాత్రం చెప్పవచ్చు.

డా॥ వెల్చేరు ఇలా అంటారు: "వీళ్ళు అలంకార భాష రాస్తారు. ప్రయోజన రహితంగా విస్తరించి రాస్తారు. అంతూ పొంతూ లేని శబ్దాడంబరం చూపిస్తారు. మన సిద్ధాంత వ్యాసాల్లో చాలావాటికి గుణాత్మకంగా నష్టం కలగకుండా మూడోవంతుకు కుదించవచ్చు." ఈ మాటల్లో ఎంతవరకు నిజముంది, ఎన్ని సిద్ధాంత వ్యాసాలకు వీటిని అన్వయించవచ్చు అనే చర్చకు పోకుండా తెలుగులో పరిశోధన ఉత్తమ ప్రమాణాలను ప్రతిబింబించేదిగా ఉండాలనే డా॥ వెల్చేరు ఆశయాన్ని సమర్థిస్తూ పరిశోధన పద్ధతుల పరిశీలనవైపు మన దృష్టి మరల్చవచ్చు.

## పరిశోధన అంటే ?

Research అన్న ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా 'పరిశోధన' అన్న పదాన్ని వాడుతున్నాం. ఆంగ్ల భాషా ప్రభావంవల్ల ఈ చక్కని పదాన్ని మనం కల్పించుకున్నాం. పరి పరిశోధించడమనే అర్థమే research కి కూడా ఉంది కాబట్టి పరిశోధన సార్థకమే. కన్నడిగులు దీన్నే సంశోధన అంటారు. ఏదైనా శోధనే. శోధించడమంటే వెదకడం, పరిశీలించడం, వడగట్టడం, సారాన్ని

వెలికితీయడం. 'శోధన' అనే పదం వేదకాలంనుంచి కూడా వాడుకలో ఉంది. ఇంగ్లీషులోని research కి వాచ్యార్థం పునరన్వేషణే అయినా, అసలు అర్థం మళ్ళీ మళ్ళీ, మరీమరీ శోధించి నిగ్గుదేల్చాలన్నదే.

లోకంలో ఎన్నో విషయాలు, విశేషాలు ఉన్నాయి. కొన్నిటిని గురించి మనకు తెలియదు, కొన్నిటిని గురించి కొంత మాత్రం తెలుసు, కొన్నిటిని గురించి కొంత ఎక్కువగా తెలుసు. సత్యాన్వేషణాతత్పరులై తెలియని విషయాల నన్నిటినీ వెదకి, పరిశీలించి పరిశోధించి 'అసలు విషయ మిది' అని చెప్ప బూనడమే పరిశోధన.

విమర్శకు పరిశోధనకు కొన్ని పోలికలు, కొన్ని భేదాలు కనిపిస్తాయి. విమర్శకుడుగా తా నెన్నుకున్న విషయాన్ని సమగ్రంగా పరిశీలించాల్సిందే, పరిశోధించాల్సిందే. కాని, అన్ని విషయాలూ పరిశోధనను అపేక్షించవు. ఏదైనా నవలనో, కథనో, కవితనో, విమర్శించడానికి పూనుకున్నప్పుడు పరిశోధనకంటె పరిశీలన, వివేచన, విశ్లేషణ ఎక్కువగా అవసరమవుతాయి. అయితే పరిశోధనకు, విమర్శ తప్పనిసరి. విషయవిమర్శే కాదు, ఆత్మవిమర్శకూడా. తాను చేస్తున్నది, చేయదలచుకున్నది, రాస్తున్నది, సమర్పించబోతున్నది సరైనదా కాదా అనే ఆత్మవిమర్శ ప్రతి పరిశోధకుడికీ తప్పక అవసరం.

పరిశోధన అంటే సామగ్రిని సేకరించి, విలువకట్టి, సమంజసమైన నిర్ణయాలు చేయడమని సరళరీతిలో చెప్పవచ్చు[1]. ప్రతిరోజూ మనం ఏవో కొన్ని నిర్ణయాలు తీసుకుంటూనే ఉంటాం. కావలసిన వస్తువుల్ని కొనాలన్నా, ఉద్యోగాల్ని వెతుక్కోవాలన్నా, జీవిత పథాన్ని నిర్దేశించుకోవాలన్నా, బాధ్యతల్ని స్వీకరించాలన్నా కొంత అన్వేషణ, కొంత ఆలోచన, కొంత పరిశోధన అవస

1. "Essentially, research is a matter of gathering and evaluating information in order to be able to draw reasonable conclusions" (J. H. Brunvand, Folhlore-A study and Research Guide, 1976), p. 85.

రమే. పరిశోధన చెయ్యాలన్నా ఇలాంటి ఆలోచనలన్నిటినీ ఒక పద్ధతి ప్రకారం సాగించి, సక్రమ వాదాన్ని సాగించి సమంజసమైన నిర్ణయాలను ప్రతిపాదించవలసి ఉంటుంది.

పరిశోధన ఒక విషయాన్ని గురించిన అవగాహనను, జ్ఞానాన్ని పెంచేదిగా ఉండాలి. జ్ఞాన పరిధిని విస్తరింపజేయలేనిది పరిశోధన కాదు. తెలిసిన విషయాన్ని మాటలు మార్చి రాయడం, నాలుగు పుస్తకాల్లో ఉన్నదాన్ని ఐదో పుస్తకంగా రాయడం, నలుగురికీ తెలిసిన విషయాన్ని తన మాటల్లో రాయడం పరిశోధన కాదు. ఎవరు ఎలా రాసినా ఏదో కొంత ఉపయోగం ఉండనే ఉంటుంది. ప్రతి రచనలోనూ కొంతశాతమైనా కొత్తదనం ఉంటుంది. కాని, ఒక విషయాన్ని గురించి సమగ్ర పరిశీలన జరపాలనుకున్న విద్యార్థి నూతన సూత్రాలను, సిద్ధాంతాలను ప్రతిపాదించడానికి కృషి చెయ్యాలి. ఇలా ప్రతిపాదించాలంటే సోపపత్తికంగా సామగ్రిని సేకరించవలసి ఉంటుంది. సేకరించిన సామగ్రిని అత్యంత సూక్ష్మంగా పరిశీలించవలసి ఉంటుంది. వినూత్నాంశాన్నే ప్రతిపాదించగలుగుతారని ఎల్లవేళలా చెప్పడానికి వీలుకాదు. అయినా, పూర్వ సిద్ధాంతాలను పునర్నిర్మించాల్సి రావచ్చు, నిర్దుష్టంగా తీర్చిదిద్దాల్సి రావచ్చు. ఏది చేసినా సత్యాన్వేషణ దృష్టితో, సమన్వయ వైఖరితో, తదేకదీక్షతో, నిరహంకారంగా, నిర్భయంగా, నిస్సంకోచంగా చేసే మహత్సాధన పరిశోధన. ఇదొక పవిత్ర కార్యం. సాధ్యమైనంతవరకు సర్వ విద్వాంస సమ్మతంగా వాస్తవాంశ ప్రతిపాదకంగా, సమగ్రంగా స్వీకృత విషయాన్ని వ్యాఖ్యానం చేయడమే పరిశోధన.

ఏది పరిశోధన, ఏది కాదు అని నిర్దిష్టంగా చెప్పడం కూడా ఒక్కొక్కసారి సాధ్యం కాదు. కొత్తదనం ఉండేదంతా పరిశోధన అనడం కూడా సమంజసం కాదు. అప్పుడు సృజనాత్మక సాహిత్యాన్ని కూడా పరిశోధన అనే చెప్పవలసి ఉంటుంది. విమర్శలో విద్వాంసుడు తన అభిప్రాయాల్ని, అనుభవాల్ని చెప్పే అవకాశం ఎక్కువగా ఉంటుంది. పరిశోధనలో తన అభిప్రాయాల్ని చెప్పడం కన్న సత్యాన్ని వెలికితీసి చూపడమే ప్రాధాన్యం వహిస్తుంది. సృజనాత్మక శక్తి

నంతా వినియోగించి, కావలసిన సామాగ్రినంతా ఉపయోగించి, వస్తుప్రధానంగా వ్యాఖ్యానించ బూనుకోవడం పరిశోధనలో భాగమవుతుంది. అందువల్ల కేవలం సామగ్రిని సేకరించడమో, ఉన్నదాన్ని విమర్శించడమో పరిశోధనకాదు. అందువల్ల పరిశోధన శాస్త్రీయాన్వేషణ అని, నూతన సత్య ప్రతిపాదక మని, మహోన్నత సిద్ధాంత సమన్వితమని, వాస్తవ విషయాభివ్యక్తి అని అర్థం చేసుకోవచ్చు.

## ఉద్దేశం - ఉపయోగం :

సత్యాన్ని వెలికితీయడం, వాస్తవాన్ని శాస్త్రీయ పద్ధతుల్లో వివరించడం పరిశోధన ముఖ్యోద్దేశమని పై వివరణవల్లే కొంతవరకు తెలిసి ఉంటుంది. కాని, సత్యాన్ని వెలికి తీయడం ఒక్కరి పరిశోధనవల్ల సాధ్యయ్యేదని ఎల్లవేళలా చెప్ప లేము. అందువల్ల పరిశోధన ఉద్దేశం సత్యాన్వేషణలో జరిపే ప్రామాణిక ప్రయత్నమని చెప్పడం సమంజసం. ఒకరు చేసిన ప్రయత్నాన్ని మరొకరు ముందుకు తీసికెళ్ళి మరికొంత సత్ఫలాన్ని సాధించవచ్చు. కాబట్టి పరిశోధన నిరంతరంగా సాగే అన్వేషణ.

సిద్ధాంత ప్రతిపాదన పరిశోధన ముఖ్యోదేశం అంటే తప్పుకాదు. శాస్త్రీయ పద్ధతుల్ని అనుసరించి, అన్వేషణ సాగించి పరిశోధకు దొక సిద్ధాంతాన్ని రూపొందిస్తాడు. పరిశోధన, సిద్ధాంతం అన్నవి వేరువేరుగా కనిపించినా పరస్పర పోషకాలుగా ఉంటాయి. ఒకటి లేక మరొకటి పరిపూర్ణం కాదు ఏదైనా విషయాన్ని గూర్చిన నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు అది వివేచనను పెంపొందిస్తుంది; విశ్లేషించే శక్తిని ప్రసాదిస్తుంది. ఏదైనా విషయాన్ని గూర్చి సామాన్యులకూ అసామాన్యులకూ కూడా సమగ్రావగాహన ఉండదు. ఆ విషయాన్ని గూర్చి సదవగాహనను పెంచేందుకు సిద్ధాంతాలు తోడ్పడతాయి. పరిశోధనవల్ల సిద్ధాంతా లేర్పడతాయి. సిద్ధాంతాల పరిశీలనవల్ల నూత్నసిద్ధాంతాలను రూపొందించే ప్రవృత్తి అలవడుతుంది. అప్పుడు మళ్ళీ పరిశోధన మొదలవుతుంది.

కొత్త సిద్ధాంతాలను రూపొందించేటప్పుడు పాత సిద్ధాంతాలన్నిటినీ కూలద్రోసెయ్యాలని భావించనక్కరలేదు. ఒక విధంగా నూతన సిద్ధాంతాన్ని ప్రతి

పాదించడమంటే జ్ఞానక్షేత్రాన్ని విస్తరింపజెయ్యడమే. అందువల్ల సిద్ధాంతాలన్నీ సార్వకాలికాలనీ, పరిష్కార యోగ్యాలు కావనీ అనుకోరాదు. పరిశోధనలు విస్తృతంగా, లోతుగా సాగేకొద్దీ సిద్ధాంతాల రూపకల్పనలో కొత్త కొత్త ఆలోచనలు వస్తుంటాయి. విజ్ఞాన పరిధి విస్తృతమవుతూ పోతుంది.

పరిశోధన ఎందుకు చెయ్యాలి అన్న ప్రశ్నకు రెండు రకాల సమాధానాలను చెప్పవచ్చు.[1] మొదటిది, ముఖ్యమైందిగా మనం భావించే విషయాన్ని గూర్చిన జ్ఞానానికి విలువైన సంగతుల్ని జోడించగలగడం. రెండవది, ఇష్టమైన క్షేత్రంలో కృషి చేయడానికి తగినంత విద్వత్తును సంపాదించడం, ఇతరుల కృషిని విలువకట్టడం, ఇతరులకు మార్గదర్శకులు కావడం. పరిశోధనలో పరిణతిని పొందిన విద్వాంసుడికి ఇవన్నీ సాధ్యమే అనవచ్చు.

పరిశోధన వల్ల ఉపయోగం సిద్ధాంత ప్రతిపాదన జరగడం అన్నది స్పష్టమైంది. ఇదొక్కటే కాక ఇటు పరిశోధకుడికీ, అటు సమాజానికి కూడా పరిశోధనవల్ల అపరిమిత ప్రయోజనాలు చేకూరుతాయి అన్నది మనకందరికీ

---

1. "…. You hope to make a valuable addition to knowledge on a subject which you believe to be, for some reason, important …… A second answer, which you might reasonably give, might be that you wish to train yourself to become a scholar, fully equipped to do further research in your chosen field, able to understand its wider problems, capable of evaluating the work of others, and prepared to instruct new apprentices in that field when the time comes…", G. Kitson Clark, Guide for research students working on Historical subjects, 1960.

తెలిసిందే. పరిశోధకుడి వైపు నుంచి ఆలోచిస్తే అతను చేసే పరిశోధన వ్యక్తిగత విద్వత్తును పెంపొందిస్తుంది. పరిశీలనాసక్తిని, పరిశీలనశక్తిని ప్రసాదిస్తుంది. అన్వేషణ అన్నది లేకుంటే జీవితమే నిరర్థకం. అట్లే ఏదైనా విషయాన్ని గూర్చి పరిపూర్ణ జ్ఞానం కలగాలంటే పరిశోధన చేసి తీరాలి. ఈ విధంగా విద్వాంసుణ్ణి పరిశోధన మహావిద్వాంసుడిగా తీర్చిదిద్దుతుంది. అదే విధంగా పరిశోధన ఫలితాలు ఇతరులకు ఎంతో మేలు చేకూరుస్తాయి. పరిశోధకుని శ్రమ ఫలితం ఇతరులకూ లభిస్తుంది.

## పరిశోధకుడికి కొన్ని సూచనలు :

సత్యాన్వేషణ తత్పరుడైన పరిశోధకుడు ఎన్నో సమస్యల్ని ఎదుర్కొంటాడు. సరైన పరిశ్రమ, అభ్యాస బలం, నిష్ఠ, ప్రామాణికత మొదలైనవి పరిశోధకుడికి కావలసిన అర్హతలు. విషయాన్ని ఎన్నుకోవడం దగ్గర్నుంచి సిద్ధాంత వ్యాసాన్ని తయారు చేసేవరకు అనేక సమస్యల్ని సమర్థవంతంగా పరిష్కరించాల్సి ఉంటుంది. ఏ యే విషయాల్ని గురించి పరిశోధన జరిగింది, ఏవేవి ఇంకా పరిశోధనను అపేక్షిస్తున్నాయి, ఏ విషయాన్ని గూర్చి పరిశోధిస్తే ఉపయోగకరంగా ఉంటుంది వగైరా సంగతుల్ని పరిశోధకుడు సునిశితంగా ఆలోచించాల్సి ఉంటుంది.

ధైర్యంతో వాస్తవ విషయాన్ని చెప్పగలగడం పరిశోధకుడికి కావలసిన ముఖ్య గుణాలలో ఒకటి. వాస్తవ విషయాన్ని చెప్పగలగాలంటే ఆధారాలను సమీకరించుకోవడం ముఖ్యం. వాస్తవాలను మరుగుపరిచే వారు చాలా మంది ఉంటారు. అంతే కాదు. ఎవరైనా గొప్ప విద్వాంసుడు పొరపాటున ఏదైనా అవాస్తవికాంశాన్నే వాస్తవంగా భ్రమింపజేశాడంటే దాన్ని సరిదిద్దడం చాలా శ్రమతో కూడుకున్న పని. అలాంటప్పుడు కూడా తాను నమ్మిన సత్యాన్ని ధైర్యంగా ప్రతిపాదించగలగాలి.

పరిశోధకుడికి మరో విధమైన ధైర్యం కూడా ఉండాలి. ఎవరైనా సరైన ఆధారాలను చూపి తనవాదాన్ని పూర్వపక్షం చేస్తే దాన్ని ఒప్పుకునే ధైర్యం

కూడా పరిశోధకుడికి అవసరం. అందరూ మానవులే, అందరికీ అన్నీ తెలియవు. ఎంత శ్రద్ధ వహించినా ఒక్కొక్క సారి తప్పుదారి పట్టే ప్రమాదం ఉంది. కాని, తప్పు ఒప్పుకొనే వాడే నిజమైన పరిశోధకుడు.

పరిశ్రమ పరిశోధకుడికి కావలసిన ఉత్తమ గుణం. నిరంతరాధ్యయన శీలుడు, సతతాభ్యాస బలసంపన్నుడు ఉత్తమ సంశోధన తత్పరుడు కాగలడు. బుద్ధి శక్తి ఉంటే ముందుకు వస్తాడు. కాని, బుద్ధి శక్తి కంటె కూడా సతతాభ్యాసం మనిషికి కొండంత బలాన్నిస్తుంది. ఈ అభ్యాసం సక్రమ పద్ధతిలో సాగడం కూడా ముఖ్యమే. దొరికిన పుస్తకమల్లా చదవడం, చిక్కిన సంగతులన్నీ రాయడం, సంపాదించిన సామగ్రి నంతటినీ కుమ్మరించడం మంచిది కాదు. ఎంతవరకు సామగ్రిని సేకరించాలి, ఎంతవరకు దాన్ని ఉపయోగించుకోవాలి, తెలిసిన దాన్ని ఎంతవరకు చెప్పాలి అన్నది తెలుసుకోవాలి. ఏదైనా రాసే ముందు ఒకటికి రెండు సార్లు ఆలోచించాలి.

చదవడం ఒక కళ, రాయడమూ ఒక కళ. పరిశోధకుడి విషయంలో చదవడం ఒక శాస్త్రం, రాయడమూ ఒక శాస్త్రం. అంటే పరిశోధకుడు చదవడమూ, రాయడమూ ఒక క్రమ పద్ధతిలో సాగించాలని అర్థం. మామూలుగా పుస్తకాన్ని చదివేవారు సంతోషం కోసం చదువుతారు లేక కాలక్షేపానికి చదువుతారు లేక జ్ఞానార్జనకోసం చదువుతారు. పరిశోధకుడు తాను విడగొట్టాలనుకున్న సమస్యను దృష్టిలో పెట్టుకొని చదువుతాడు. కొత్త ఆధారాలేమైనా లభిస్తాయనే దృష్టితో చదువుతాడు, తనకు ఎంతవరకు ఆ పుస్తకం ఉపయోగపడుతుందో చూచి చదువుతాడు. రాయడంకూడా ఒక పద్ధతి ప్రకారం రాస్తాడు. శాస్త్రీయ పద్ధతుల ననుసరించి రాస్తాడు. ఆధారాలను చూపించకుండా, తనకు తోచినది రాయడం, భావుకతను చూపించడం. ఆవేశ పడడం పరిశోధకుడు చేయదగినవి కావు.

అనవసరమైన వేగంతో పరిశోధనను ముగించాలనుకోడం కూడా మంచిది కాదు. కొందరు పరిశోధకులు త్వరత్వరగా పట్టం పొందాలనే దృష్టితో త్వరత్వరగా ముగించేసి కాయితాలుకూడా సరిగ్గా చూచుకోకుండా సిద్ధాంత వ్యాసాలను

సమర్పించేసి చేతులు దులుపుకుంటారు. ఒక చిన్న విషయాన్ని గురించి నెలల తరబడి ఆలోచించవలసి రావచ్చు. ఏదైనా సరే చక్కగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలే గాని ఏదో ఒక సమయంలో మనసుకు తోచిన దానిని సాక్షరం చేసెయ్యడం మంచిది కాదు.

అలాగే ఎవరిని గురించి అయినా, ఏదైనా విషయాన్ని గురించి అయినా ప్రశంసలు, తిరస్కారాలు, దూషణలు ఉంటే వాటిని గురించి మరింత ఎక్కువ శ్రద్ధ తీసుకోడం అవసరం. సిద్ధాంత వ్యాసంలో అధిక ప్రసంగాలు చెయ్యడం, అప్రస్తుత ప్రశంసలు జరపడం, అసంగత భాషణలకు పాల్పడడం కూడదు. ఇకపోతే పరిశోధకుడు ఆత్మ ప్రశంసకు పూనుకోడం కూడా మంచిది కాదని మళ్ళీ చెప్పుకో నక్కరలేదు.

ఇవన్నీ దృష్టిలో ఉంచుకొని సిద్ధాంత వ్యాసాన్ని రాస్తే నీరసంగా, పేలవంగా, శాస్త్రాంధకారంతో కూడి ఉండదా అనే ప్రశ్న వస్తుంది. సత్యాన్ని కూడా ఆసక్తికరంగా, సక్రమంగా, కుతూహలజనకంగా చెప్పవచ్చని నిరూపించాల్సిన వాడు పరిశోధకుడే.

## రకరకాల పరిశోధనలు :

కళలకు సంబంధించినది, శాస్త్రాలకు సంబంధించినది అనే రెండురకాల పరిశోధనల్ని ప్రముఖంగా పేర్కొనవచ్చు. సాహిత్యం, చరిత్ర, ఆర్థికశాస్త్రం, భాషాశాస్త్రం, వాణిజ్యం, రాజకీయశాస్త్రం మొదలైనవి కళలవిభాగానికి చెందినవి (arts). జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం, రసాయనశాస్త్రం వంటివి విజ్ఞానాలు లేక శాస్త్రాలు (sciences). ఇది ఈనాటి విభజన పద్ధతి. ప్రాచీనదృష్టితో చూస్తే ఛందశ్శాస్త్రం, అలంకారశాస్త్రం, నాట్యశాస్త్రం మొదలైనవీ శాస్త్రాలే. ఇది ఒక విధంగా నిజమే, అయినా పారిభాషిక శబ్దాలుగా కళల్ని, శాస్త్రాల్ని వేరు చేసినప్పుడు ఆ రెండింటికి సంబంధించిన పరిశోధనల్నీ వేరుచేసి చూడాల్సి ఉంటుంది.

సాహిత్యాది కళల్నిగూర్చిన పరిశోధనను విశ్లేషణాత్మకమనీ, జంతు శాస్త్రాదుల్ని గూర్చిన పరిశోధనను ప్రయోగాత్మకమనీ చెప్పవచ్చు. కొన్ని ప్రయోగాలను జరిపి ఫలితాలను నివేదికల రూపంలో, పట్టిక రూపంలో, రేఖా చిత్రాల రూపంలో అందించడం ప్రయోగాత్మక పరిశోధనలో భాగం. ప్రత్యక్ష ప్రయోగంవల్ల సాగించే శాస్త్రపరిశోధన అనేక విధాల కళాపరిశోధనకంటె వేరవుతుంది. విశ్లేషణాత్మక పరిశోధన ఎక్కువ వివరణాత్మకంగా ఉంటుంది. శాస్త్రంలో ఉన్నవిషయాలను ఉన్నట్లుగా చెప్తే చాలు. సాహిత్యాదుల విషయంలో సూత్రరూపంలో చెప్తే చాలదు; వివరించాలి, విశ్లేషించి చూపాలి. అయితే కళా పరిశోధనకూడా శాస్త్రీయంగా (scientific) జరపాలి అనే విషయాన్ని మర్చి పోకూడదు. తర్కబద్ధమైన విశ్లేషణతో, సక్రమ విధానాలతో, వివేకంతో, వివే చనతో జరిపేది ఏదైనా శాస్త్రీయమే.

ప్రస్తుత గ్రంథానికి సంబంధించిన సాహిత్య పరిశోధన ఎలాంటిదో కొంత వివరంగా పరిశీలిద్దాం. సాహిత్యం ఒక విజ్ఞాన సర్వస్వమంత పరిధికలది. ఏదో ఒక రూపంలో సాహిత్యం సమగ్రజీవన విమర్శను చేపడుతుంది. ఒకవైపు జీవిత సత్యాలను చెప్తూ మరొకవైపు సౌందర్యదృష్టిని కలిగి ఉంటుంది. సాహిత్య సౌందర్యాన్ని తెలిపే సాహిత్య విమర్శకు కొంతవరకు భిన్నమవుతూ సాహిత్య పరిశోధన సాగుతుంది. సాహిత్యానికి ఉండే ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని, సాహిత్యసృష్టిని సమగ్రదృక్పథంతో వివేచించవలసి ఉంటుంది.

సమాజశాస్త్రం, భాషాశాస్త్రం, మానవశాస్త్రం వంటి అధ్యయన శాఖల్లో సామగ్రిని సేకరించడంకూడా పరిశోధనలో భాగమే. కాని, సాహిత్యపరిశోధనలో సామగ్రిని సేకరించడం పరిశోధన కాదు. సాహిత్య విషయంలో చేసే సిద్ధాం తాలు సృజనాత్మక కృతుల పరిశీలన దృక్పథంలో ఉన్నత ప్రమాణాలను ఏర్పరచాలి. వైజ్ఞానిక అధ్యయన ఫలితంగా చేసిన సిద్ధాంతాలు సాహిత్య విమర్శ విషయంలో సదభిరుచిని, వివేచనశక్తిని పెంపొందిస్తాయి.

ప్రాచీన లక్షణగ్రంథాలు సాహిత్యమీమాంసను ఒక శాస్త్రంగా తీర్చి దిద్దాయి అనడంలో సందేహం లేదు. సాహిత్య సిద్ధాంతాలను సూత్రరూపంలో

మనకందించిన లక్షణగ్రంథాలు ఈనాటి పరిశోధన గ్రంథాలకు ఏమాత్రం తీసిపోవు. పాణినివంటి సూత్రకారులు ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలకు ఇచ్చిన ప్రేరణను మరిచిపోరాదు. అయితే సాహిత్యపరంగా ప్రాచీన ఆలంకారికులు నిర్వచించిన సూత్రాలను సార్వజనీనమైనవని, సార్వకాలికమైనవని ఆధునిక విద్వాంసులు ఒప్పుకోరు. అన్నిరకాల సాహిత్య కృతులూ కొన్ని సార్వజనీన సూత్రాలకు కట్టుబడి ఉండాలనుకోడం దురాశ అని వీరి భావం. లిఖిత సాహిత్యానికీ, మౌఖిక సాహిత్యానికీ, ప్రాచీన సాహిత్యానికీ, ఆధునిక సాహిత్యానికీ, మహాకావ్యానికీ, వచన కవితకూ ఒకే రకమైన ప్రమాణాలను అన్వయింపజేయాలనుకోడం సరికాదు.

సాహిత్య పరిశోధనలో ఆరురకాలను గుర్తించవచ్చని డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం చక్కగా వింగడించి చూపారు[1]. అవి (1) సాహిత్య సిద్ధాంత ప్రతిపాదకం (2) అనుశీలనాత్మకం (3) సమన్వయాత్మకం (4) వివేచనాత్మకం (5) విశ్లేషణాత్మకం (6) వర్ణనాత్మకం. వీటిలో వినూత్న సిద్ధాంత ప్రతిపాదకం అత్యుత్తమమైనదని చెప్పవచ్చు. సిద్ధాంత దర్శన స్పృహతో సాహిత్యపు విలువలను నిగ్గు తేలిస్తే అది అనుశీలనాత్మక మవుతుంది. బహిరంతరాశయ సమన్వయాన్ని సాధిస్తూ పరిశోధన జరిపితే సమన్వయాత్మక మవుతుంది. కార్యకారణ సంబద్ధమైన ఆవిష్కరణ పద్ధతిని అనుసరించి వివేచిస్తే వివేచనాత్మక పరిశోధనగా పరిగణిస్తారు. విషయాంశాలను విశ్లేషించిచూపే పద్ధతి విశ్లేషణాత్మకం. విషయ వివరణే ప్రధానంగా ఉండేది వర్ణనాత్మక పరిశోధన గ్రంథం. కేవల వర్ణన ఉండేది సిద్ధాంత గ్రంథం కాక సమీక్షా గ్రంథమవుతుంది. "సాహిత్యంలో నిజమైన పరిశోధనమంటే సాహిత్య సిద్ధాంత దర్శనమే దానిని ప్రతిపాదించే సిద్ధాంతవ్యాసం సంగ్రహంగా, సారవంతంగా, సూత్రప్రాయంగా, శాస్త్రదర్శనంగా, తత్త్వసుందరంగా ఉంటుంది."[2]

---

1. 'తెలుగులో పరిశోధన,' ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ, పు. 365.
2. అదే, పు. 365.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారే పేర్కొన్న మరో ఐదువిధాలైన సాహిత్య పరిశోధనల్ని[1] ఈ సందర్భంలో పేర్కొనడం అప్రస్తుతం కాదు అవి : (1) సాహిత్యతత్త్వాన్వేషణ ప్రధానమైన పరిశోధన. ఉదా: ధ్వన్యాలోకం, ఔచిత్య విచార చర్చ మొదలైనవి. (2) సాహిత్యలక్షణ వివేచన ప్రధానమైన పరిశోధన. ఉదా : భామహాలంకారాదులు. (3) పరిశీలనాత్మక సాహిత్యాధ్యయన ప్రధానమైన పరిశోధన. ఉదా: వివిధ ప్రబంధాలను గురించి అధ్యయనం చేస్తూ జరిపిన పరిశోధనలు. (4) కావ్యాదర్శన మీమాంస ప్రధానమైన పరిశోధన ఉదా: రాయప్రోలు వారి రమ్యాలోకం, మాధురీ దర్శనం మొదలైన గ్రంథాలు. (5) కావ్యానుశీలన మార్గ నిర్దేశక ప్రధానమైన పరిశోధన. ఛందస్సు, అలంకారం, రసదృష్టి వగైరాలను గురించి వచ్చిన పరిశోధనలు.

పరిశోధకుడు సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించే మార్గాన్నిబట్టి కూడా సాహిత్య పరిశోధనలో కొన్ని ప్రభేదాలను గుర్తించవచ్చు.[2]

1. నిశ్చిత సాహిత్య సిద్ధాంత నిరూపణం
2. అనుకూల సిద్ధాంత స్థిరీకరణం
3. పూర్వసిద్ధాంత పరిష్కరణం
4. వినూత్న సిద్ధాంతాన్వేషణం
5. సిద్ధాంతానుశీలన విధాన వివేచనం

మరోవిధంగా చూస్తే సాహిత్యపరమైన పరిశోధనలు రెండు రకాలుగా సాగుతాయని చెప్పవచ్చు. కాలానుక్రమంగా సాహిత్యవికాసాన్ని వివేచించడం మొదటిది. ప్రక్రియాపరంగా సాహిత్యానుశీలనకు పూనుకోవడం రెండవది. సాహిత్య ప్రక్రియల ఉత్పత్తి వికాసాల పరిశీలన ఉత్తమమైందని కొందరు విమర్శకుల అభిప్రాయం. కాని, ఏ విధంగానైనా సమగ్ర పరిశోధనకు అవకాశముంది. కాలానుక్రమంగా సాహిత్య వికాసాన్ని పరిశీలించేటప్పుడుకూడా కాల, దేశ

1. 'తెలుగులో పరిశోధన'. ఆం. ప్ర. సాహిత్య అకాడెమి, పు. 366.
2. అదే, పు. 366.

సామాజిక పరిస్థితులనుబట్టి సాహిత్యంలోని పరిణామాన్ని చక్కగా గుర్తించి వినూత్న విషయాలను వెలికితీసే ప్రయత్నాలను చెయ్యవచ్చు. మొత్తంమీద ఈ రెండు రకాల పరిశోధనలుకూడా సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణానికి సహాయంచేసేవిగా ఉండాలి.

ఇలా రకరకాల పరిశోధనల్ని సాగించిన విద్యార్థి పరిశోధన ఫలితాలను సమర్పించడం కూడా అనేక విధాలుగా చెయ్యవచ్చు. పరిశోధన పరిధినిబట్టి, స్వరూపాన్నిబట్టి, సమర్పించే స్థలాన్నిబట్టి, సందర్భాన్నిబట్టి ఫలితాల్ని ప్రకటించడం జరుగుతుంది. సదస్సులో చదవాల్సిన వ్యాసం మౌఖిక సమర్పణను అనుసరించి ఒక విధమైన శైలిలో, నిర్దిష్ట కాలానికి తగిన నిడివికలిగి ఉండాలి. లిఖిత వ్యాసం మరొక విధమైన శైలిలో ఉండాలి. అలాగే నివేదిక రూపంలో, పట్టీల రూపంలో, సుదీర్ఘ సిద్ధాంతగ్రంథ రూపంలో పరిశోధన ఫలితాలు ఉండవచ్చు. ఫలితాల సమర్పణ విధానాలను గురించి మరోచోట ముచ్చటించుకుందాం.

మొత్తంమీద కొంగ్రొత్త ఫలితాలను అందించాలనే ఆశయంతో చేసే పరిశోధనకూడా ఒక సృజనశీల ప్రక్రియ. ఒక్కొక్కసారి పరిశోధకుడు తన పరిశోధన పద్ధతులను తానే నిర్మించుకోవలసి వస్తుంది. అలాంటప్పుడు పరిశోధకుడే శాస్త్రకారుడూ అవుతాడు. అందువల్ల పరిశోధకుడు లక్షణకర్తగా, వ్యాఖ్యాతగా, దార్శనికుడుగా, సృజనశీల రచయితగా, వివేచనాపరుడుగా బహురూపాలను దాల్చవలసి ఉంటుంది. ఏదిఏమైనా సత్యాన్వేషణే పరిశోధన ప్రథమ కర్తవ్యం అన్న దాన్ని మరచిపోరాదు.

# కృత్యాద్యవస్థ

పరిశోధకుని అభిరుచికి తగిందీ, ఉపయోగకరమైందీ, ఏదైనా విషయానికి సంబంధించిన అవగాహనను పెంచేదీ, కొంగ్రొత్త వెలుగుల్ని ప్రసరించేదీ అయిన విషయాన్ని పరిశోధనకు ఎన్నుకోవడం పెద్ద సమస్య. ఇదికూడా సృజనాత్మక కృతుల రచనలో ఎదుర్కొనే కృత్యాద్యవస్థ వంటిదే. పరిశోధకుడు ఎన్నుకొనే విషయాన్నే (Topic or Subject) కొందరు సమస్య (Problem) అంటారు. నిజానికి పరిశోధన చేయడమంటే సమస్యల్ని కొని తచ్చుకోవడమే. విషయాన్ని ఎన్నుకోడం దగ్గర్నుంచే సమస్యలు ప్రారంభమవుతాయి.

విశ్వవిద్యాలయంలో స్నాతకోత్తర పట్టాన్ని పొందిన వెంటనే కొంత మంది పరిశోధకులుగా చేర్తారు. మరికొందరు ఎం. ఏ, చదివిన తర్వాత కొంత అనుభవం సంపాదించి సంశోధనతత్పరులవుతారు. మరికొందరు కళాశాలలోనో, విశ్వవిద్యాలయంలోనో అధ్యాపకులుగా చేరి కొన్ని సంవత్సరాల బోధనానుభవం తర్వాత పరిశోధన చేపడ్తారు. ఈ మూడు రకాల వారి అవస్థలూ వేరువేరుగా ఉండవచ్చు. విద్యార్థి దశలో స్వతంత్రమైన ఆలోచనకు అంతగా తావు లేదు. అధ్యాపకులు చెప్పిన విషయాలను జ్ఞాపకముంచుకొని, తాను సేకరించిన విషయాలను కొంతవరకు జోడించి ప్రశ్నలకు తగినట్లు సమాధానాలు రాయడం మీదనే విద్యార్థి దృష్టి ఉంటుంది. పరిశోధన అనే విభిన్న క్షేత్రంలో కాలిడిన తర్వాత కూడా కొంతమంది విద్యార్థుల మానసిక స్థాయినుంచి పైకి ఎదగలేక పోవడం సామాన్యంగా కనిపిస్తుంది.

మార్గదర్శకులను ఎన్నుకొన్న విద్యార్థి అడిగే మొదటి ప్రశ్న "నేను ఏ విషయాన్నిగూర్చి పరిశోధన చేస్తే బాగుంటుందో చెప్పండి" అని. మన విద్యా విధానంలో విద్యార్థులకు ఆలోచించే అవకాశం ఇవ్వక పోవడమే ఇలాంటి ప్రశ్నలకు మూల కారణం. మన విద్యాబోధనంతా ప్రభుసమ్మితంగా సాగుతుంది.

విద్యార్థి తన అభిరుచి ఏమిటో తెలుసుకొని, దాని కనుగుణంగా జ్ఞాన సము పార్జన చేసేందుకు తగిన అవకాశాన్ని మనం ఇవ్వడం లేదు. పరిశోధకుడు స్వానుభవాన్ని, అభిరుచిని, తన పరిమితుల్ని దృష్టిలో ఉంచుకొని తగిన విష యాన్ని తానే ఎంచుకోవలసి ఉంటుంది. ఇదెలా జరగాలి అన్న దాన్ని చూద్దాం

విద్యార్థి మొట్టమొదట చేయవలసిన పని తన విద్యాభ్యాస కాలంలో తనని ఎక్కువగా ఆకర్షించిన విషయాల్ని పట్టీ చేసుకోడం. వీటిలో ఏవి నిజమైన సమస్యలు అన్న దాన్ని నిర్ణయించుకోడం రెండవ పని. అంతవరకు జరిగిన పరిశోధనల్లో అస్పష్టంగా ఉన్నవేవి, నూత్న విషయాలను ఆవిష్కరించడానికి అవకాశం ఉండే సమస్యలేవి అన్న దాన్ని గురించి ఆలోచించాలి. ఇలాంటి ఆలోచన తర్వాత కొన్ని విషయాలు మనోనేత్రంముందు కదలాడుతాయి. తర్వాత చేయవలసిన పని ఈ విషయాలను గురించి వీలయినన్ని ప్రశ్నల్ని తయారుచేసుకోడం. ఇలా ప్రశ్నల్ని తయారుచేసుకొని వాటికి సమాధానాల్ని వెతికే పని కొన్ని రోజులు సాగిస్తే మన అభిరుచికి తగిన విషయమేదో, దాని పరిధి ఎంతో, పరిమితులేమిటో బోధపడుతుంది.

ఉదాహరణకు ఒక విద్యార్థికి ఆధునిక సాహిత్యమంటే ఆసక్తి ఎక్కువను కుందాం. "ఆధునిక సాహిత్యం" అన్న విషయం అత్యంత విశాలమైంది కాబట్టి పరిశోధనకు విషయంగా స్వీకరించడానికి తగదు. "తెలుగు ఆధునిక సాహిత్యం" అని కొంతవరకు పరిమితం చేసుకున్నా అదీ విస్తృత ప్రణాళిక అవుతుంది గాని పరిశోధన విషయం కాదు. విద్యార్థి ఆధునిక తెలుగు సాహిత్యానికి సంబంధించిన ప్రశ్నావళిని తయారు చేసుకోడం మొదటి మెట్టు.

1. ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రముఖ ప్రక్రియ లేమిటి?
2. ఈ సాహిత్యం మీద ఆంగ్ల ప్రభావం ఎంతవరకుంది?
3. ఇతర రాష్ట్రాల, దేశాల సాహిత్యాలు ఎంతవరకు ప్రభావం చూపాయి?
4. తెలుగువారిదే అని చెప్పుకోదగిందె ఎంతవరకుంది?
5. ఈ సాహిత్య ప్రక్రియల ఆవిర్భావ, వికాసాలకు దోహదం చేసిన పరిస్థితు లేవి?
6. సాహితీవేత్తలు వివిధ ప్రక్రియల్లో చేసిన ప్రయోగాలు ఎలాంటివి? వాటి స్వరూపం, పరమార్థం, ప్రభావం.

ఈ విధంగా సాగే ప్రశ్నావళివల్ల మనకు ఆయా విషయాలను గురించిన అవగాహన పెరుగుతుంది. తర్వాత మనం పరిమిత పరిధిలో ఒక విషయాన్ని ఎన్నుకొని ఈ ప్రశ్నావళిని ఇంకా సూక్ష్మంగా తయారు చేసుకోవాల్సి ఉంటుంది.

ఉదాహరణకు ఆధునిక తెలుగు సాహిత్యంలో మనకు నచ్చింది కవిత్వ భాగమైతే ప్రశ్నావళిని ఇలా విస్తరించుకోవాలి.

1. తెలుగులో ఆధునిక కవిత్వ వికాసానికి దారితీసిన పరిస్థితు లేమిటి?
2. ఆధునిక కవిత్వంలో కనిపించే ప్రముఖ పంథా లేవి?
3. తెలుగు కవిత్వంపై ప్రభావాలు, జరిగిన ప్రయోగాలు.
4. తెలుగులో ఆధునిక కవిత్వం సాధించిన ప్రయోజన మేమిటి ?
5. మాధ్యమానికి, తత్త్వానికి, రూపానికి, శైలికి సంబంధించినంత వరకు తెలుగు కవిత్వంలో కాలానుగుణంగా, ప్రక్రియానుగుణంగా కల్గిన మార్పులేవి? వాటి స్వరూపమేమిటి?

ఇలాంటి ప్రశ్నల వల్ల విద్యార్థికి సూక్ష్మదృష్టి అలవడుతుంది. చిన్న విషయాన్ని గైకొని అత్యంత సూక్ష్మ పరిశీలన జరిపి కొత్త విషయాలను చెప్ప గలగడం మంచిది. అయితే ఈ విషయాలకు సంబంధించిన అన్ని విషయాలనూ స్థూలంగానైనా తెలుసుకోవడం అవసరం.[1] అప్పుడే విద్యార్థికి తను ఎన్నుకొనే విషయాన్ని గూర్చిన సమగ్రావగాహన ఏర్పడుతుంది.

---

1. "And any one engaged in work of the mind should at some time take a bird's-eye view of the large field of which he will cultivate a small patch," Jacques Barzun and Henry F. Graff, The Modern Researcher, New York, 1962, p. 43 (as quoted in "Fundamentals of Research" Busnagi Rajannan, p. 3).

పైన చెప్పినదాని కర్థం విద్యార్థి అన్ని నిర్ణయాలూ తానే తీసుకోవాలని కాదు. మార్గదర్శకునితో చర్చించి నిర్ణయం తీసుకోకూడదనీ కాదు. నిర్ణయాల నన్నింటినీ మార్గదర్శకునికే వదలివేయరాదన్నదే ముఖ్యోద్దేశం. అనుభవజ్ఞుడైన మార్గదర్శకుడు ఇంతవరకు జరగని పరిశోధన క్షేత్రాలను గురించి విద్యార్థికి చెప్పడంలో తప్పులేదు. అయితే వాటిలో తన అభిరుచికి తగిన విషయాన్ని ఎన్నుకోడంలో విద్యార్థి విజ్ఞతను చూపించాలి. ఎం. ఏ., విద్యార్థిగా ఉన్నప్పుడు తరగతిలో తల ఊచినట్లే, పరిశోధకుడైన తర్వాత కూడా చేయడం తగదు. కనీసం పరిశోధక విద్యార్థి అయిన తర్వాతైన ఆలోచించడం నేర్చుకోవాలి. అందరూ ఇలాగే ఉంటారని, విద్యార్థులకు ఆలోచనే ఉండదనీ కాదు. కాని, విద్యార్థుల్లో అనేకులు ఈ విధంగా ప్రవర్తిస్తూ ఉండడం వల్ల ఇంతగా చెప్పాల్సి వచ్చింది.

చిక్కు విప్పాల్సిన సమస్యను ఎన్నుకున్న తర్వాత మార్గదర్శకునితో దాన్నిగురించి సవివరంగా చర్చించడం అవసరం. సమానాభిరుచి, ఆయావిషయ పరిజ్ఞానం, విద్వత్తు గల విద్వాంసులతో, సహాధ్యాయులతో, మిత్రులతో కూడా చర్చలు జరపడం అవసరం. సామగ్రిని సేకరించుకునేముందు జరిపే ఇలాంటి చర్చలవల్ల ఎన్నుకున్న సమస్యనుగురించి ఎన్నోవిషయాలు తెలుస్తాయి. నిర్దిష్ట మైన పరిధిలో పరిశోధనను సాగించడానికి తగిన నేపథ్యం ఏర్పడుతుంది.

కొన్నిసార్లు పరిశోధకులు ఎవరో మిత్రులు చెప్పారనో, మార్గదర్శకులు సూచించారనో ఒక విషయాన్ని స్వీకరించి ఇష్టంలేకున్నా, కష్టనష్టాలకు లోనయినా ఎలాగో ఓలాగు పూర్తి చేయాలనుకుంటారు. ఇలా చేయడం ఎంత మాత్రం మంచిదికాదు. దీనివల్ల పరిశోధిత విషయానికిగాని, పరిశోధకునికిగాని ఎలాంటి మేలూ జరగదు. అందువల్ల కొంతకాలం తర్వాత తాను చేస్తున్న పరిశోధన తృప్తికరంగా లేకపోయినట్లయితే పరిశోధకులు పునర్విమర్శ చేసుకోడం మంచిది. తప్పులు తెలుసుకోడం, తప్పులు దిద్దుకోడం పరిశోధకుల కుండాల్సిన ప్రాథమిక లక్షణాలు.

ఇటీవలి కాలంలో కొందరు "పరిశోధన అంటే ఏముందిలే, మూడు నాలుగు సంవత్సరాలు కష్టపడితే ఎవరైనా చెయ్యవచ్చు" అనే తేలికదృష్టిని అల వరచుకుంటున్నట్లుగా కనబడుతోంది. ఏ విధమైన ప్రాథమిక శిక్షణ అవసరం లేకుండానే పరిశోధన చేయవచ్చుననే దృష్టి ప్రబలుతోంది. పరిశోధకులుగా చేరా లనుకునే విద్యార్థులచేత రెండుమూడు పరిశోధన వ్యాసాల్ని రాయించడం మార్గ దర్శకులు చేయవలసిన మొదటి పని. దీనివల్ల విద్యార్థులకు కొంత అనుభవం లభిస్తుంది. అసలు విద్యాభ్యాస కాలంలోనే ఇలాంటి శిక్షణ ఇవ్వడం అవసరం. పరిశోధనకు అవసరమైన కొన్ని ప్రాథమిక పద్ధతుల విషయంలో స్నాతకోత్తర విద్యార్థులకు శిక్షణ ఇవ్వడం మన కర్తవ్యం.

సమస్యని ఎన్నుకునేటప్పుడు గమనించాల్సిన విషయాల్లో మరికొన్నిటిని ఇక్కడ ప్రస్తావించాలి. పరిశోధకులు కొన్ని మూలభూతమైన ప్రశ్నల్ని వేసుకో వాలి. అసలు ఈ విషయంలో 'నాకు ఆసక్తి ఉన్నదా' అని ప్రశ్నించుకోవడం మొదటిమెట్టు. 'నాకు సరైన మార్గదర్శకత్వం లభిస్తుందా' అన్నది రెండవ ప్రశ్న. మార్గదర్శకు లెవరూ సర్వజ్ఞులు కారు. తన దగ్గర పరిశోధన చేసే విద్యార్థి తీసుకున్న విషయాన్ని గురించిన స్థూల పరిజ్ఞానం మాత్రమే మార్గ దర్శకునికి ఉంటుంది. కాని, తన మార్గదర్శకునికి ఏమాత్రం సదవగాహనలేని విషయాన్ని స్వీకరించి పరిశోధకులు పరిశ్రమించలేరు. ఎంచుకున్న విషయాన్ని అనుకున్న వ్యవధిలో పూర్తి చేయడం సాధ్యమా అన్నది పరిశోధకులు వేసుకో వాల్సిన మూడవ ప్రశ్న. తాను పరిశోధన జరుపుతున్న చోట తన పరిశోధనకు తగిన వసతులున్నవా లేవా, గ్రంథాలయ సౌకర్యం ఉన్నదా లేదా అన్నవి కూడా పరిశీలించాల్సిన విషయాలే. ఇవన్నీ ఆలోచించి విషయాన్ని ఎన్నుకుంటే పరిశోధక విద్యార్థికి మొదటి గండం గడిచినట్లే.

## ప్రాథమిక శోధన :

కృత్యాద్యవస్థలో భాగమే ప్రాథమిక శోధన (Preliminary inquiry). తన అభిరుచి కనుగుణమైన విషయాన్ని ఎన్నుకున్న తర్వాత పరి శోధకుడు ప్రాథమిక శోధనను ప్రారంభించాలి. మొదట తన విషయాన్ని

గురించి మరెక్కడైనా పరిశ్రమ జరిగిందా అన్న దాన్ని తెలుసుకోవాలి. తెలుగును గురించి చెప్పాలంటే ఎన్నో పరిశోధనలు పునరావృత్తాలయ్యాయి. ఒకే కవిని గురించి, ఒకే సాహిత్య ప్రక్రియను గురించి పలువురు సిద్ధాంత వ్యాసాలను తయారు చేశారు. ఎవరికి వారు 'మేము చేసిందే వేరు' అని చెప్పు కుంటారు. కాని, సాధ్యమైనంత వరకు ఇలాంటివి జరగకుండా చూడడం మంచిది.

ఒకవేళ తాను ఎంచుకున్న విషయాన్ని గురించి విభిన్న దృక్కోణంతో ఎవరైనా పరిశీలించి ఉంటే దాన్ని గురించి బాగా తెలుసుకోవాలి. గ్రహించిన విషయాన్ని గురించిన సమగ్ర సమాచారాన్ని సేకరించడం ప్రాథమిక శోధన కాలంలోనే ప్రారంభం కావాలి.

సంబంధిత గ్రంథపఠనం పరిశోధకుని ప్రథమ కర్తవ్యం. ఏదైనా కావ్యాన్ని గురించి పరిశోధన చేయదలచుకుంటే ఆ కావ్య స్వరూపాన్నిబట్టి తత్సంబంధమైన లక్షణాల అవగాహన అవసరమవుతుంది. ఏదైనా జానపద సాహిత్య ప్రక్రియను స్వీకరించినట్లయితే జానపద సాహిత్య స్థూల స్వరూపం. ఉత్పత్తి విభజనాదులను గురించి తెలుసుకోవాలి. అలాగే భాషాశాస్త్రసంబంధమైతే ఆ శాస్త్రానికి సంబంధించిన మూలతత్త్వాల అనుశీలన జరపాలి. ప్రసిద్ధ విజ్ఞాన సర్వస్వాలను, సాహిత్య చరిత్రలను, భాషా చరిత్రలను, అలంకార సర్వస్వా లను పరిశీలించి వాటిలోని గ్రంథసూచి, విషయసూచి మొదలైన వాటిద్వారా ప్రాథమిక సమాచారాన్ని తెలుసుకోవాలి.

పైన చెప్పినట్లు చేసే సంబంధిత సాహిత్య సమీక్షలో మూడు రకాల గ్రంథాల పరిశీలన జరపాలి. 1. ముఖ్యాధారాలు (Primary sources): స్వీకృత విషయానికి సంబంధించిన సిద్ధాంత గ్రంథాలు, వ్యాసాలు, ప్రశ్నా వళులు, ఉత్తరాలు, దినచర్యలు, ప్రత్యక్ష కథనాలు, స్వీయచరిత్రలు మొదలైనవి. 2. అప్రధానాధారాలు: ముఖ్యాధారాలనుంచి తీసుకొని తయారుచేసిన ఆధారా లివి. అనువాదాలు, సమీక్షలు, సంక్షిప్త రచనలు, విజ్ఞాన సర్వస్వాలు, వ్యాఖ్యా నాలు మొదలైనవి. 3. తృతీయశ్రేణి ఆధారాలు : అప్రధానాధారాల సహాయంతో తయారుచేసిన పాఠ్యగ్రంథాల వంటివి ఈ రకానికి చెందుతాయి.

ఇక్కడొక హెచ్చరిక కూడా అవసరం. గ్రంథ పఠనాసక్తి ఉండే విద్యార్థికి తగిన గ్రంథాలు దొరకాలే గాని వాటిని వదలిపెట్టడు. కాని, గ్రంథ పఠనంలోనే కాలమంతా వ్యయమైతే అసలు పరిశోధన ప్రారంభమే కాకపోయే ప్రమాదముంది. ఉత్తమగ్రంథాల సమ్మోహన శక్తికి కట్టుబడ్డ పరిశోధకుడు, తన కింకా సరైన శక్తి సమకూడలేదనే అజ్ఞానంలోబడి అసలు విషయమే మరిచి పోవచ్చు. అందుచేత ఏదో ఒక తారీఖున పరిశోధన ప్రారంభించడానికై నిర్ణయించుకొని అంతలోపల ప్రాథమిక శోధనను ముగించడం మంచిది.

**తాత్కాలిక గ్రంథసూచి :** ప్రాథమిక శోధనలో భాగంగా సంబంధిత సాహిత్య సమీక్ష పూర్తి అయిన తర్వాత తాత్కాలిక గ్రంథసూచిని తయారు చేసుకోవాలి. దీనికోసం ముఖ్యాధార గ్రంథాల్లో విజ్ఞాన సర్వస్వాలలో, తృతీయ శ్రేణి ఆధారాలలో ఉండే గ్రంథాల పట్టికల నన్నిటినీ పరిశీలించాలి. గ్రంథ సూచిని మాత్రమే కాక వ్యాససూచి, పత్రికాసూచి, ఇతర ఆధారాలను గురించిన పట్టికల్ని కూడా తయారు చేసుకోవాలి. రేడియో ప్రసంగాలు, ఇతర ఉపన్యాసాలు, టేపులు, మైక్రోఫిల్ములు మొదలైన వాటిని గురించిన సమాచారాన్ని కూడా పొందు పరచు కోవాలి.

**అధ్యయన ప్రణాళిక :** తాను ఎన్నుకొన్న విషయాన్ని చక్కగా విశ్లేషించడానికి, నిగ్గు దేల్చడానికి సరైన ప్రణాళికను ఏర్పరచుకోవడం తర్వాతి మెట్టు. ఒక్కొక్క విషయానికి ఒక్కోవిధమైన ప్రణాళిక అవసరం కావచ్చు. కొన్ని విషయాలకు వివిధ ప్రదేశ సందర్శనం ఆవశ్యకం కావచ్చు. మరి కొన్నిటికి వ్యక్తులను కలుసుకోవడం, అభిప్రాయ సేకరణ ముఖ్యం కావచ్చు. మరికొన్ని విషయాలకు వివిధ గ్రంథపఠనమే ప్రధానం కావచ్చు. మరికొన్నిటికి శాస్త్రవిషయాలను అన్వయింపజేసి విశ్లేషించడమే అవసరం కావచ్చు. స్వీకృత విషయాన్నిబట్టి అధ్యయన ప్రణాళికను రూపొందించుకోవాలి. అన్ని రకాల పరిశోధన విషయాలకు సంబంధించిన సామాన్య ప్రణాళికను ఏర్పరచడం కష్టం. మొదటి అధ్యాయంలో చెప్పినట్లుగా జంతుశాస్త్రాదులకు సంబంధించిన పరిశోధనలో ప్రయోగాలే ప్రాధాన్యం వహిస్తాయి. కళలకు సంబంధించినవి విశ్లేషణాత్మకాలని స్థూలంగా చెప్పవచ్చు. ప్రయోగాత్మక పరిశోధనలో పరికల్పన (hypothesis)ను నిర్ధరించి సిద్ధాంతంగా రూపొందించడానికి పరిశ్రమించడం జరుగుతుంది. విశ్లేషణాత్మక పరిశోధనలో పరికల్పనకు అంతగా ప్రాధాన్యం లేదు. ఏ విధమైన పరిశోధనైనాసరే మొదట కొన్ని ఊహలు (assumptions)

చేయడం తప్పనిసరి. ఊహలు సరైనవా కావా అని శోధించడానికి ఒక ప్రణాళికను ఏర్పరుచుకోడానికి ప్రయత్నించాలి. పరిశోధనకు కాగల కాల పరిమితిని, తీసుకోవలసిన జాగ్రత్తలను మొదటే నిర్ణయించుకోడం అవసరం. సామగ్రిని సేకరించడానికి పూనుకునేందుకు ముందే అధ్యయన ప్రణాళికను నిర్ణయించుకొని దాన్ని లిఖితరూపంలోనే భద్రపరుచుకోడం మేలు.

**సిద్ధాంత సారాంశ రచన :-** కృత్యాద్యవస్థలో చివరి ఘట్టం సారాంశ (Synopsis writing) ఇంతవరకు జరిపిన ప్రాథమిక శోధనవల్ల తాను చేయదలచుకున్న పరిశోధనను గూర్చి కొంత వరకు అవగాహన ఏర్పడుతుంది. కాబట్టి పరిశోధకుడు సిద్ధాంత సారాంశాన్ని తయారు చేసుకోవచ్చు. ప్రధానంగా రాయదల్చుకున్న అధ్యాయాల రేఖామాత్ర చిత్రణే సారాంశం. సామాన్యంగా సిద్ధాంత వ్యాసాల్లో అధ్యాయాలు ఒక నమూనాలో ఉంటాయి. మొదటి అధ్యాయం పరిచయాత్మక మైందిగా ఉంటుంది. ఈ 'ప్రవేశిక'లో పరిశోధకుడు తాను తీసుకున్న సమస్యను గురించి చెప్పి తన అధ్యయనం ఎలాంటి ప్రాముఖ్యం కలదో వివరిస్తాడు. తన అధ్యయన ప్రమేయాన్ని, పరిమితుల్ని, ఉద్దేశాలను వివరిస్తాడు. తన పరిశోధన ఇంతకు పూర్వం ఎవ్వరూ చేపట్టనిదీ, కొత్త అధ్యయన క్షేత్రానికి సంబంధించిందీ అయితే దాని స్వరూప స్వభావాలకు కూడా కొన్ని పుటలు కేటాయిస్తాడు. వీటిని రేఖామాత్రంగా సిద్ధాంత సారాంశంలో పొందు పరచుకోవలసి ఉంటుంది. ఇక సిద్ధాంత వ్యాసంలోని ఇతర అధ్యాయాలు ఆయా విషయాల్ని బట్టి మారుతుంటాయి. ప్రయోగాత్మక పరిశోధనకు సంబంధించిన సిద్ధాంత గ్రంథమైతే ఒకటి రెండు అధ్యాయాలలో పరికల్పనల్ని గురించి, అనుసరించబోతున్న విధానాలను గురించి, ప్రయోగాల స్వభావాన్ని గురించి వివరించాల్సి ఉంటుంది. అలాగే పరిశోధన ఫలితాలను ఒకటి రెండు అధ్యాయాలలో ప్రకటించాల్సి ఉంటుంది. విశ్లేషణాత్మక పరిశోధనలోని అధ్యాయాలు కాలక్రమాన్ననుసరించేవి గానో, వివిధ ప్రక్రియలకు అనుగుణమైనవి గానో, వస్త్వాది వివిధ విషయ వివరణ కనుగుణంగానో ఉంటాయి. అన్ని అధ్యాయాల చివర ఉపసంహారం ఉంటుంది. సిద్ధాంత వ్యాస సారాంశం పరిశోధన సాగించడాని కొక దారిదీపిక లాగా పనిచేస్తుంది. అయితే పరిశోధన ముందుకు సాగే కొద్దీ కొన్ని అధ్యాయాల శీర్షికల్ని మార్చవలసి రావచ్చు; అసలు అధ్యాయాన్నే పునర్నిర్మించాల్సి రావచ్చు. ఏది ఏమైనా ఈ ప్రాథమిక ప్రయత్నాలన్నీ పరిశోధనను సుగమం చేస్తాయి. పరిశోధకుడు ఒక దారిలో పడ్తాడు.

# సామగ్రి సేకరణ

పరిశోధనకు కావలసిన ముడిపదార్థాలు బోలెడన్ని ఉన్నాయి. సామగ్రిని సక్రమ పద్ధతుల్లో సేకరించుకొని కాని పరిశోధన చేయడం సాధ్యం కాదు. ముఖ్యాధార సామగ్రిని, అప్రధాన సామగ్రిని అవసరానికి తగ్గట్లుగా సేకరించడానికి కొన్ని పరికరాలు కావాలి. సామగ్రిని సేకరించి భద్రపరచుకోడానికి కొన్ని పద్ధతు లున్నాయి. వాటి వివరణే ఈ ప్రకరణం.

పరిశోధనకు కావలసిన సామగ్రిని ఎక్కడినుంచి సేకరించాలి, ఎలా సేకరించాలి, ఏ విధంగా భద్రపరచాలి అన్న విషయాలను తెలుసుకోవలసి ఉంది. సామగ్రిని వ్యక్తులనుంచి, సంస్థలనుంచి, గ్రంథాలయాలనుంచి, శాసనాలనుంచి, నాణ్యాలనుంచి, దస్తావేజులనుంచి, పత్రికలనుంచి సేకరించవచ్చు. గ్రంథపఠనం ద్వారా, ప్రశ్నావళి ద్వారా, సమావేశాలద్వారా, ధ్వని ముద్రణ (Tape-Recorderతో) ద్వారా, ఫిల్ములద్వారా సామగ్రిని సేకరించవచ్చు.

**ఏది చదవాలి, ఏది చదవకూడదు :** సామగ్రి సేకరణ సమయంలో కూడా అనేక గ్రంథాల్ని, పత్రికల్ని పరిశీలించాలి, చదవాలి, చదివిన వాటి నుంచి కొంత సమాచారాన్ని, రాసి ఉంచుకోవాలి. ప్రారంభంలో సంబంధిత సాహిత్య సమీక్ష జరపడం వేరు, సామగ్రి సేకరణ సమయంలో పరిశోధనలో భాగంగా చదవడం వేరు. ప్రారంభంలో పరిశోధనకు తగిన విషయాన్ని ఎన్నుకోడం కోసం, తద్విషయాన్ని గూర్చిన స్పష్టమైన అవగాహన ఏర్పడడం కోసం చదువుతాం. అలాగే పరీక్షకోసం చదివే విద్యార్థి తాను చదివింది పరీక్ష కోసం ఎంతవరకు ఉపయోగపడుతుందా అనే దృష్టితో చదువుతాడు. ఉబుసుపోక కోసం చదివేవారు మరో విధంగా చదువుతారు. వ్యాఖ్యానం రాయాలనుకున్న వారు, అర్థ తాత్పర్యాలు రాయాలనుకున్నవారు, అనువాదం చెయ్యాలనుకున్న వారు ఒక్కో విధంగా చదువుతారు.

పరిశోధన చేపట్టినవారు ఆకర గ్రంథాల తాత్కాలిక పట్టికనుబట్టి గ్రంథ పఠనాన్ని కొనసాగించాలి. అయితే ప్రతిగ్రంథాన్ని అవసరమున్నా లేకున్నా ఆమూలాగ్రం పఠించడం మంచిది కాదు. ఆ గ్రంథాని కొక విషయ సూచిక ఉన్నట్లయితే దాన్నిబట్టి మనకు అవసరమైన భాగాలను ఎంచుకోడం మంచిది. విషయసూచిక లేకున్నా అధ్యాయాల శీర్షికలనుబట్టి మనకు ఏ విషయం కావాలో నిర్ణయించుకొని ఆ అధ్యాయాల్ని చదవాల్సి ఉంటుంది. మొత్తం మీద అధ్యయనానికి ఆవశ్యకమైన విధంగా పఠనాన్ని పరిమితం చేసుకోవడం ఆవసరమని తెలుసుకుంటే చాలు.

## గ్రంథాలయం :

సామగ్రిని సేకరించడానికి అత్యంత ముఖ్యమైన స్థలం గ్రంథాలయం. తరతరాలుగా మనిషి సంపాదించిన జ్ఞానం పుస్తకాలలో సాక్షరమై శాశ్వతత్వాన్ని సంతరించుకుంటుంది. గ్రంథాలయాల్లో మంచివీ, చెడ్డవీ, పనికి వచ్చేవీ, పనికిరానివీ, ఆ మూలాగ్రం శోధించదగ్గవీ, అక్కడక్కడా చూచుకోవలసినవీ వందలు, వేల సంఖ్యలో పుస్తకాలుంటాయి.

గ్రంథాలయంలో ప్రవేశించిన తర్వాత ఒక్కొక్కసారి దిక్కుతోచదు. ఏ పుస్తకాన్ని ఎలా సంపాదించాలో, సంపాదించిన పుస్తకాన్ని ఎంతవరకు చదవాలో, చదివిన దానిలో ఎంతవరకు ఉపయోగించుకోవాలో అర్థం కాదు. గ్రంథాలయాన్ని సక్రమంగా ఉపయోగించుకోడం కూడా ఒక శాస్త్రమే.

గ్రంథాలయంలో మనకు సహకరించే వాటిలో ముఖ్యమైనవి వివిధ రకాల పట్టికలు. కొన్నిచోట్ల రచయితల పట్టికలు, మరికొన్ని చోట్ల విషయానుగుణమైన పట్టికలు ఉంటాయి. కొన్ని గ్రంథాలయాల్లో రెండు రకాల పట్టికలూ ఉండవచ్చు. పరిశోధకులు తాత్కాలికంగా ఒక గ్రంథ సూచిని తయారు చేసుకొని ఉంటే ఏ విధమైన పట్టికనైనా సమర్థవంతంగా ఉపయోగించుకోవచ్చు. పట్టిక ప్రకారం తనకు కావలసిన పుస్తకాలు గ్రంథాలయంలోని ఏయే విభాగాలలో లభిస్తాయో పరిశోధకుడు తెలుసుకొని గుర్తించుకోవచ్చు. లేక విషయాన్నిబట్టి

గ్రంథాలయ పట్టికల సహాయంతో పుస్తకాలను ఎంచుకోవచ్చు. గ్రంథాలయం లోని కార్డుల్లో పరిశోధకులకు ఉపయోగించే సమాచారం ఉంటుంది. రచయిత పేరు పుస్తకం పేరు, ప్రచురించిన సంవత్సరం, ప్రచురణకర్త పేరు మొద లైనవి ఉంటాయి. పుస్తకాల కొక సంఖ్య ఉంటుంది. వీటి సహాయంతో మన కుండే సమస్యకు పుస్తకాల్లో పరిష్కారాన్ని వెతుక్కోడానికి ప్రయత్నాలు మొదలవుతాయి.

గ్రంథాలయాలలోని పుస్తకాలలో మన విషయానికి నేరుగా సంబంధించిన పుస్తకాలు కాక సామాన్య పఠనాని కుద్దేశింపబడిన పరామర్శన గ్రంథాలు (Reference Books) కూడా ఉంటాయి. విజ్ఞాన సర్వస్వాలు ఎలాంటి విషయాని కైనా ఉపయోగపడేవి. వీటివల్ల మనం చదవాల్సిన ముఖ్యమైన పుస్తకాలను గుర్తించికూడా తెలుసుకోవచ్చు. మనకు నేరుగా సంబంధం లేకున్నా విజ్ఞాన సర్వ స్వాలను తిరగవేయడం మంచిది. వీటిలో సంక్షిప్తంగా అన్ని విషయాలనూ చెప్పడం జరుగుతుంది కాబట్టి మన పరిశోధన విషయాన్ని గురించికూడా ఒక స్థూలదృష్టి ఏర్పడుతుంది. విజ్ఞాన సర్వస్వాలలో బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం లాంటివి సామాన్య విజ్ఞానసర్వస్వాలు. ధార్మిక, సమాజ శాస్త్రీయ, వైజ్ఞానికాది క్షేత్రాలకు సంబంధించినవి విశేష విజ్ఞానసర్వస్వాలు, Facts on File, World Almanac లాంటివి ప్రతి సంవత్సరం కొత్తకొత్త విషయాలతో వెలువడే ఉపయుక్త గ్రంథాలు, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వములాంటివి తెలుగువారికి పనికివచ్చే విజ్ఞాన సర్వస్వాలు.

రచయితల సూచి, గ్రంథసూచి, ఆంధ్రరచయిత్రుల సూచిక, భారతీయ సాహిత్యసూచిక, పదప్రయోగ సూచికం వంటివి విశేషంగా ఉపయోగపడతాయి. ఇక నిఘంటువుల్లోకూడా చాలారకా లున్నాయి. వైద్యనిఘంటువు, మాండలిక పదకోశాలు, జానపద నిఘంటువులు మొదలైన వివిధోద్దేశిత నిఘంటువు లున్నాయి. వీటిలో మనకు కావలసిన వాటిని ఎంచుకొని సక్రమంగా ఉపయోగించుకోగలగాలి.

గ్రంథాలయంలో మనం ఉపయోగించుకోవలసిన వాటిలో పత్రికలుకూడా ప్రముఖపాత్ర వహిస్తాయి. వారపత్రికల్లో మాసపత్రికల్లోకూడా మనకు కావలసిన

ముఖ్యమైన సమాచారం లభించవచ్చు. కొన్ని పత్రికలు సంవత్సరాంతంలో ప్రకటిత వ్యాసాలపట్టికల్ని ప్రచురిస్తూ ఉంటాయి. వాటివల్ల ఎక్కువ ఉపయోగం ఉంటుంది.

పైన చెప్పినవే కాక ఒక్కొక్క విజ్ఞాన సర్వస్వంలోనూ, నిఘంటువు లోను, పత్రికల వార్షిక వ్యాససూచికల్లోనూ కనిపించే అకారాది పదసూచికల ద్వారా ఏమేమి చదవాలో నిర్ణయించుకోవచ్చు. గ్రంథాలయాల్లోనే నివేదికలు కార్యకలాపాల సమీక్షలు మొదలైనవి కూడా దొరుకుతాయి. విశ్వవిద్యాలయ గ్రంథాలయాల్లో అముద్రిత సిద్ధాంత గ్రంథాలుకూడా ఉంటాయి. వీటివల్లకూడా ఉపయోగం పొందాల్సి ఉంటుంది.

ఏ విధమైన ఆకరమైనా సరే ఉపయోగించుకునే ముందు పరిశోధకుడు కొన్ని విషయాలను గుర్తించుకోవలసి ఉంటుంది. ప్రామాణికమైన సమాచారాన్నే ఎంచుకోవడం మొదటిది. తాను సేకరిస్తున్న సామగ్రి నిర్దుష్టమైందని, కొంం గ్రాహ్యదని, ఉత్తమస్థాయికి చెందిందని, నమ్మదగిందని, అనసరాలకు అనుగుణ మైందని నిర్ణయించుకుని తగినట్లుగా ఆ సమాచారాన్ని ఉపయోగించుకోవాలి.

## అముద్రిత గ్రంథ భండారాలు:

ముద్రితగ్రంథా లుండే సామాన్య గ్రంథాలయాలు కాక అముద్రిత గ్రంథాలుండే గ్రంథభండారాలు కూడా విశేషంగా పరిశోధకుడికి ఉపయోగి స్తాయి. రెండూ గ్రంథాలయాలే అయినా అక్కడి పరిసరాలు, ఉపయోగించు కోవలసిన పద్ధతులు, కార్యవిధానం వేరుగా కనిపించవచ్చు. సాహిత్య పరిశోధ కుడు అముద్రిత గ్రంథభండారాలకు వెళ్ళవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంటుంది. మద్రాసులోని ప్రాచ్యలిఖిత భండాగారం, తంజావూరులోని సరస్వతీ మహల్ గ్రంథాలయం తెలుగు సాహిత్య విద్యార్థికి అత్యంతోపయోగకరమైన రాష్ట్రేతర ప్రాంత గ్రంథాలయాలు.

అముద్రిత గ్రంథ భండారాలలో వ్రాతప్రతులకు సంబంధించిన వర్ణ నాత్మక గ్రంథసూచిక లుంటాయి. వాటి సహాయంతో మనకు కావలసిన

పుస్తకాన్ని, అందులో సమాచారాన్ని స్థూలంగా తెలుసుకోవచ్చు. వర్ణనాత్మక సూచికల సహాయంతో మనకు కావలసిన పుస్తకాల్ని మాత్రం ఎన్నుకొని, వాటిని తెప్పించుకొని కావలసినంత మేరకు ఉపయోగించుకోవచ్చు.

## ఇతర ఆకరాలు :

గ్రంథాలయాల నుంచి సామగ్రిని సేకరించడమే కాక ఇతర విధాలుగా కూడా సేకరించాల్సి ఉంటుంది. కొన్ని పరిశోధన విషయాలకు ప్రశ్నావళిని తయారు చేయడం అవసరం. ముఖ్యంగా భాషాశాస్త్రానికి సంబంధించిన విషయమైతే ప్రశ్నావళిని తయారు చేయడం ఒక్కొక్కసారి తప్పనిసరి కావచ్చు. ప్రశ్నావళి సాధ్యమైనంత సంక్షిప్తంగా ఉండడం ముఖ్యం. సుదీర్ఘ ప్రశ్నావళికి సమాధానాలను రాబట్టడం సులభం కాదు. ఒక్కొక్క ప్రశ్నకు ఒక్కొక్క సమాధానం మాత్రమే ఉండేట్లుగా ప్రశ్నావళిని తయారు చెయ్యాలి. ప్రశ్నలోనే సమాధానం ఉండేటట్లుగా ప్రశ్నావళిని తయారుచెయ్యగూడదు.

ఛాయా చిత్రాలు, భూ పటాలు, మైక్రోఫిల్ములూ, టేపులు, డాక్యుమెంట రీలు, విడియో కేసెట్లు మొదలైనవి కూడా పరిశోధనలో సామగ్రి సేకరణకు ఉపయోగిస్తాయి.

వ్యక్తులను కలుసుకోడం, ముఖాముఖి సంభాషణ జరపడం కూడా పరిశోధనలో ఉపయోగిస్తుంది. ముఖాముఖి సంభాషణకు కూడా ముందుగానే ప్రశ్నావళిని తయారు చేసుకోవాలి. ముఖాముఖి సంభాషణ జరపదలచుకున్న వ్యక్తి ఏ క్షేత్రంలో కృషి చేశాడో ఆ క్షేత్రాన్ని గురించి ప్రశ్నావళిని తయారు చేసుకొని వెళ్ళాలి.

## కావలసిన పరికరాలు :

సిద్ధాంత వ్యాసాన్ని రాసేవారు ముఖ్యంగా చేసేది తెల్ల కాయితాలను నల్లబరచడమే కాబట్టి ముఖ్యంగా కావలసినవి తెల్ల కాయితాలే. అయితే సామగ్రిని సేకరించడానికి ఏ పరిమాణంవి, ఎంత మందం కలవి, ఎలాంటివి ఎక్కువగా

పనికివస్తా యన్నది ముఖ్యం. సామగ్రిని సేకరించే టప్పుడు మనం వెచ్చించే కాలం వృధా కాగూడదు. సేకరించిన సామగ్రిని సరిగ్గా మనం ఉపయోగించే గలిగి ఉండాలి. కొందరు నోట్ పుస్తకాలలో వివిధ గ్రంథాలనుంచి విషయాలను రాసుకుంటూ పోతారు. ఇది మంచి పద్ధతి కాదు. నోటు పుస్తకాలలో రాస్తే రాసింది భద్రంగా ఉంటుంది. నిజమే. కాని, దాన్ని మళ్ళీ ఉపయోగించుకోవా లంటే మరొక విషయ సూచిక తయారు చేసుకొని ఒక్క విషయం కోసం పది చోట్ల వెతకవలసి వస్తుంది.

కొందరు ఫుల్‌స్కేప్ పేజీలలో అన్ని విషయాలూ కలగాపులగం చేసి రాసుకుంటూ పోతారు. అదీ మంచిది కాదు. ఒక్కొక్క పుటలోనే అనేక విషయాలను రాసుకోడంకన్న చిన్న చిన్న కాయితాల మీద ఏదైనా ఒక్క విషయాన్ని రాసి ఉంచుకోడం పరిశోధనకు మంచిది.

కొంచెం మందపాటి కాయితాన్ని గాని, లేక మంచి నాణ్యమైన కాయితాన్ని గాని కత్తిరించి చిన్న చిన్న చీటీలుగా చేసి పరిశోధకుడు తన దగ్గరుంచుకోవాలి. పిహెచ్. డి., విద్యార్థికే కాక పరిశోధనపట్ల ఆసక్తిఉన్న ఎవరికైనా సరే ఇలాంటి చీటీలు పనికి వస్తాయి. మామూలు ఫుల్‌స్కేప్‌సైజు కాయితాన్ని ఒకసారి మడిచి మళ్ళీ మరోసారి మడిస్తే వచ్చే పరిమాణం (4" × 7") గల చీటీలు బాగా పనికి వస్తాయి. లేదా కొంచెం మందం గల కాయితాలైనా సరే 4" × 6" లేక 5" × 8" పరిమాణం గల చీటీలుగా కత్తిరించుకోవచ్చు. మూలసామగ్రికి ఒక రకమైన చీటీలను, అప్రధాన సామాగ్రికి మరొక రకమైన చీటీలను ఉపయోగించ వలసి ఉంటుంది.

సామగ్రి సేకరణకు అత్యంత ముఖ్యమైన కాయితాలు కాక పరిశోధనకు స్వీకరించిన విషయాన్నిబట్టి ఇంకా కొన్ని పరికరాలు కావలసి వస్తాయి. విషయం జానపద విజ్ఞానానికి సంబంధించిందో, భాషా శాస్త్రానికి సంబంధించిందో, అయితే టేప్ రికార్డర్ తప్పనిసరి. గేయాలు మొదలైన మౌఖిక ప్రక్రియల్ని సేకరించ డానికి, భాషామాండలికాలను సేకరించడానికి టేప్ రికార్డర్ తప్పక ఉండాలి. అలాగే కొన్ని కళల సేకరణకు, నృత్యాల పరిశీలనకు విడియో టేపులను,

ఫిల్ములను, స్థిర ఛాయా చిత్రాలను ఉపయోగించుకోవలసి ఉంటుంది. ఆయా విషయాలనుబట్టి ఈ విశేషపరికరాలను పరిశోధకుడు ఉపయోగించుకోవాలి.

**టిప్పణి రాసుకొనే విధానాలు** (Methods of taking notes):

పరిశోధకుడు ఎక్కడెక్కడ సమాచారం ఉందో తెలుసుకొని, దాన్ని సేకరించి భద్రపరచుకోడానికి కావలసిన పరికరాలను సమకూర్చుకొన్న తర్వాత టిప్పణి (Notes) రాసుకోవాలి. పైన చెప్పినట్లు టిప్పణి రాసుకోడానికి చిన్న చిన్న చీటీలే ఎక్కువ అనుకూలంగా ఉంటాయి.

టిప్పణి రాసుకోడానికి కొన్ని ముఖ్యమైన సూచనల్ని గుర్తుంచుకోవాలి (1) ప్రతి ప్రధాన భావానికి లేక అభిప్రాయానికి వేరువేరు చీటీలను ఉపయోగించాలి, (2) ప్రతి చీటీకి ఒకవైపు అందులో రాసిన విషయం దేనికి చెందిందనే సంగతిని ఒక శీర్షిక ద్వారా సూచించాలి. ఈ శీర్షిక సంక్షిప్తంగా, సూచ్యంగా, సాంకేతికంగా ఉండాలి. వివరణాత్మకంగా ఉండగూడదు; అయితే స్పష్టంగా ఉండాలి, (3) చీటీకి పై భాగంలోనే మరొక చివర రచయిత లేక సంపాదకుని పేరు, పుస్తకం అచ్చయిన సంవత్సరం, పుట సంఖ్య ఉండాలి, (4) చీటీలో నమోదు చేసిన విషయం స్పష్టంగా, నిర్దుష్టంగా, అనతి దీర్ఘంగా, నిష్కర్షగా ఉండాలి.

సృజనాత్మక రచనకు పరిశోధనకు ఉండే భేదాన్ని సామగ్రిని సేకరించే సమయంలో మరిచిపోకూడదు. సొంత అభిప్రాయాలను మాత్రమే ఎక్కువగా ప్రకటిస్తూ రాసే విమర్శ, కొన్ని ఉద్దేశాల కనుగుణంగా రాసే పాఠ్యగ్రంథాలు, వ్యాసాలు కూడా పరిశోధన వ్యాసాలకు, సిద్ధాంత వ్యాసాలకు భిన్నమైనవి. పరిశోధనకు ఆకరాలను స్పష్టంగా చూపడం ప్రాథమికావసరం. ఆకరాలను చూపకుండా అందరి అభిప్రాయాలను తనవిగా చూపడం పరిశోధకుడు చేయకూడని పని. "ఈ శాసనం క్రీ. శ. 575 నాటిదని కొందరంటారు", "ఈ కావ్యం 16 వ శతాబ్దికి చెందిందని ఒక విద్వాంసుడు అభిప్రాయపడ్డాడు", "ఆ గ్రంథంలో ఈ విషయాన్ని గూర్చి రాయడం జరిగిందట" వంటివి పరిశోధకుడు రాయకూడని వాక్యాలు.

పైన చెప్పిన కొన్ని విషయాలను దృష్టిలో ఉంచుకొని వీలైనంత ఎక్కువగా సమాచారాన్ని సేకరించుకోవాలి. మూలసామగ్రిని ఎంత ఎక్కువగా సేకరించుకొంటే పరిశోధనకు అంత మంచిది. అప్రధాన సామగ్రి విషయంలో చూపే ఔదాసీన్యం మూలసామగ్రి విషయంలో పనికిరాదు.

సమాచారాన్ని సేకరించేటప్పుడు మూడు రకాలుగా చెయ్యవచ్చు. (1) ఉన్నదాన్ని ఉన్నట్లుగా రాసుకోడం. అంటే ఉదాహృత వాక్యాలుగా తీసుకోడం అన్నమాట. ఎవరైనా విద్వాంసులు చెప్పిన మాటలు చాల విలువైనవనిపిస్తే, అవి సంక్షిప్తంగా, అనల్పార్థం భాసించేట్లుగా ఉంటే అలాగే ఉదాహరించ వచ్చు. అలాంటి వాక్యాలను రాసుకునేటప్పుడు ఎక్కువ శ్రద్ధ వహించాలి. మధ్య మధ్య కొన్నిమాటల్ని వదిలేయడం లాంటివి చెయ్యకూడదు. ఒకవేళ మధ్యలో ఏదైనా వదిలేస్తే మూడు చుక్కలు పెట్టాలి (. . .) . ఒకవేళ వాక్యం చివర వదిలేస్తే నాలుగు చుక్కలతో సూచించాలి (. . . .). ఉదాహృత వాక్యాల మధ్యలో మనం ఏదైనా చేరిస్తే [ ] ఇలాంటి బ్రాకెట్లతో సూచించాలి. (2) ఒక్కొక్కసారి సారాంశాన్ని రాసుకుంటే చాలు. సారాంశాన్ని రాసుకునేటప్పుడు కూడా ఎక్కడినుంచి ఆ సమాచారాన్ని గ్రహిస్తున్నామో ఆ మూలాన్ని సక్రమంగా రాసి ఉంచుకోవాలి. (3) సారాంశం కూడా అక్కర లేదనుకుంటే మనం చదివినంత మేరకు భావాన్ని మాత్రం రాసుకుంటే చాలు.

సమాచారాన్ని సేకరించే సమయంలోనే మనకే కొన్ని కొన్ని భావాలు తట్టవచ్చు. అలాంటి వాటిని కూడా వెంటనే సామగ్రిని సేకరించడానికి సిద్ధం చేసుకున్న చీటీలలో భద్ర పరచాలి. ఈ విధంగా మనకు అవసరమైన అన్ని విషయాలకు సంబంధించిన సమగ్ర సమాచారాన్ని చీటీలలో భద్రపరిచితే దాన్ని ఉపయోగించుకొని అనేక పరిశోధన వ్యాసాలను కూడా రాయవచ్చు. సిద్ధాంత వ్యాసం సమర్పించిన తర్వాత కూడా అవి ఉపయోగపడతాయి.

సామగ్రి సేకరణకోసం తయారుచేసుకున్న చీటీలలో ముఖ్యంగా రెండు రకాల సమాచారాన్ని పదిలపరచుకోవలసి ఉంటుంది. (1) ఉపయోగించుకోవలసిన గ్రంథాల సమాచారం, (2) పరిశోధనకు ఉపయోగించే సమాచారం.

గ్రంథాల వివరాలను రాసుకోడానికి 3" × 5" చీటీలను, ఇతర సమాచారాన్ని రాసుకోడానికి 4" × 7" చీటీలను ఉపయోగించవచ్చు.

## గ్రంథాల వివరాలను రాసుకొనే పద్ధతి:

మొదట రచయిత పేరును ఉన్నది ఉన్నట్లుగా రాసుకోవాలి. ఇద్దరు రచయితలకంటె ఎక్కువ మంది రచయితలుంటే మొదటి రచయిత పేరు రాసుకొని "మొ॥వారు" అని (మొదలైనవారు) రాసుకోవచ్చు.
ఇంగ్లీషులో అయితే—

C. R. Reddy et al.

అని రాసుకోవచ్చు. 'et al' అంటే 'and others' అని అర్థం. రచయిత కలం పేరు ఉపయోగించి ఉంటే మొదట దాన్ని రాసుకొని బ్రాకెట్లలో అసలు పేరును రాసుకోవాలి. ఒకవేళ పేరులోని మొదటి అక్షరాలను మాత్రమే ముద్రించి ఉంటే ఒక్కొక్క అక్షరం తర్వాత బ్రాకెట్లో పూర్తి పేరును రాసుకోవాలి.

మి. రా. గో.

మి. [మిడిపాటి] రా. [మ] గో. [పాలం]

ఒకవేళ పుస్తకాలు సంకలనమై ఉండి సంపాదకుల పేర్లుంటే, సేకరించిన పద్యాలు వగైరా సంకలనమై ఉంటే ఈ క్రింది విధంగా రాసుకోవాలి. అనువాదకుని పేరున్నా కూడా నమోదు చేసుకోవాలి.

గొల్లపూడి సుబ్బారావు, సంపా.

గొల్లపూడి సుబ్బారావు, అను.

ఒకవేళ ఏ రచయితా, సంపాదకుడూ కాక ఏదైనా సంస్థ ప్రచురించిన పుస్తకమైతే ఆ సంస్థ పేరునే రాసుకోవాలి.

జానపద విజ్ఞానభారతి, మైసూరు : జానపద కథా సంకలనం.

రచయిత పేరు, లేక ప్రచురణకర్త పేరు రాసుకున్న తర్వాత పుస్తకం శీర్షికను పూర్తిగా రాసుకోవాలి. పుస్తకం పేరు కింద ఒక గీత గీయాలి. ఒక

వ్యాస సంకలనంలోనుంచి ఏదైనా వ్యాసాన్ని తీసుకుంటుంటే దాన్ని ఉదాహృత వాక్యంలో ఉంచాలి.

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, 'ఆంధ్రవాగ్గేయకార చరిత్రము', <u>రాళ్ళపల్లి పీఠికలు.</u>

గ్రంథాల వివరాలను రాసుకునేటప్పుడు గమనించాల్సిన మరికొన్ని విషయాలున్నాయి.

పుస్తకం ఎన్నవ ముద్రణమో రాసుకోవాలి. ప్రథమ ముద్రణమైతే ఏమీ అక్కరలేదు.

రెండవ ముద్రణము

మూడవ పరిష్కృత ముద్రణము

ఇలాంటి వాటిని రాసుకోవాలి.

ఏదైనా పుస్తకం పెక్కు సంపుటాలను కలిగిఉంటే సంపుటం సంఖ్యను కూడా నామోదు చేసుకోవాలి.

అన్నమాచార్య సంకీర్తనములు. సంపు. 27.

పుస్తకం ప్రచురింపబడిన స్థలంకూడా రాసుకోవాలి, ఒకవేళ ప్రచురింపబడిన స్థలాన్ని సూచించకపోతే స్థ.లే (స్థలం లేదు) అని రాసుకోవచ్చు. కొన్ని ఇంగ్లీషు పుస్తకాలకు అనేక ప్రచురణ స్థలాలను ఇచ్చి ఉంటారు. అలాంటి వాటిలో మొదటి దానిని రాసుకోవాలి.

ప్రచురణకర్తపేరు, ప్రచురణ సంవత్సరం, పుట సంఖ్యలుకూడా గ్రంథాల వివరాల సేకరణలో భాగమని మర్చిపోరాదు. ఒకవేళ వ్యాసం అయితే ఏ పుస్తకంలోని వ్యాసమో రాసుకోవడమే కాక ఆ వ్యాసం పుట లెన్ని అన్నదీ రాసుకోవాలి.

పత్రికలనుంచి వ్యాసకర్తల సమాచారాన్ని రాసుకొనే పద్ధతుల్నికూడా తెలుసుకోవలసి ఉంది. వ్యాస శీర్షికను ఉదాహృత చిహ్నాల మధ్య రాసుకోవాలి. తర్వాత పత్రికపేరు రాసుకోవాలి, తర్వాత సంపుటం, సంచిక సంఖ్యలు, ప్రచురణతేదీ, వ్యాసం ఉండే పుట సంఖ్యలు రాసుకోవాలి. ఇట్లే తాళపత్ర గ్రంథాలు మొదలైనవాటి వివరాలనుకూడా పూర్తిగా రాసి ఉంచుకోవాలి.

## పరిశోధనకు ఉపయోగించే సమాచారం :

ఇంతవరకు చెప్పింది గ్రంథాల వివరాలను రాసి ఉంచుకొనే పద్ధతి. ప్రస్తుతం పరిశోధనకు ఉపయోగించే సమాచారాన్ని 4" × 7" చీటీలలో రాసుకోవలసిన పద్ధతిని గూర్చి తెలుసుకుందాం.

చీటీలలో కుడివైపు పై అంచున మనం నోట్సు తీసుకుంటున్న పుస్తకం రచయిత పేరు రాసుకోవాలి. మనం గ్రంథాల వివరాలలో రాసుకొన్న పేర్లలో సంక్షిప్త నామాలను వదిలివేసి అసలు పేరును మాత్రం రాసుకుంటే చాలు. అందే ఇక్కడ రాసుకొనే పేరును బట్టి ఉపయుక్త గ్రంథ సూచిలో పూర్తి వివరాలను చూచుకునేట్లు ఉండాలి. ప్రస్తుతం రచయిత పేరు, పుస్తకం ప్రచురితమైన సంవత్సరం, పుట సంఖ్య మాత్రం రాసుకుంటే చాలు. మరీ ఎక్కువగా ఒక భాషలో ఉండే పేర్లయితే ఇంటి పేరు కూడా రాసుకోవలసి వస్తుంది. సుబ్బారావు, రామారావు, మూర్తి, శాస్త్రి, సత్యనారాయణ లాంటివి వందలు, వేలు. అందువల్ల ఇంటిపేరు, లేక పూర్తి పేరుకు సంబంధించిన పొడి అక్షరాలు కూడా రాసుకోడం తప్పనిసరి. చలం, శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి లాంటి పేర్లు అంతమాత్రమే రాసుకుంటే చాలు.

చీటికి ఎడమచేతివైపు పైఅంచున ఆ చీటీలో రాసుకున్న సమాచారం ఏమిటనే విషయాన్ని సూచించేట్లుగా ఒకటి రెండు పదాలు రాసుకోవాలి. దీన్ని బట్టి మనం చీటీలను విషయాని కనుగుణంగా పేర్చుకునేట్లుగా ఉండాలి. ఇక కావాల్సిన సమాచారాన్ని విజ్ఞతతో, అవసరానికి అనుగుణంగా, స్పష్టంగా ఉపయోగపడేట్లుగా రాసుకోవడం సామగ్రి సేకరణలో అత్యంతముఖ్యమైన భాగమని మళ్ళీ చెప్పనక్కరలేదు.

# ఆలోచన – అన్వేషణ

సామగ్రిని సేకరించడానికి, సిద్ధాంత వ్యాసాన్ని తయారు చెయ్యడానికి మధ్య చెయ్యవలసిన ఆలోచన, అన్వేషణ ఏమిటనే విషయాన్ని గురించి ప్రకృత ప్రకరణంలో చెప్పబడుతుంది. సిద్ధాంత గ్రంథాన్ని తయారు చెయ్యడానికి ముందే మనకు కావలసిన విషయాలు ఎక్కడెక్కడ ఉన్నాయి, సేకరించిన విషయాలను ఎలా అమర్చుకోవాలి అన్న దాన్ని గురించిన స్పష్టమైన అవగాహన ఉండాలి.

పరిశోధన సమయంలో వేలకొద్ది పుటలలో సమాచారాన్ని సేకరించి పెట్టుకొంటాం. దానిలో కావలసినవి, అక్కర్లేనిది బోలెడంత ఉంటుంది. అక్కర్లేనిదాన్ని వదిలివేసేందుకు పరిశోధకుడు తయారై ఉండాలి. ఏదైనా సేకరించినంత మాత్రాన తప్పక సిద్ధాంత గ్రంథంలో చేర్చాలనే నియమం లేదు. ముఖ్యంగా పరిశోధకులు ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. సిద్ధాంత గ్రంథంలో రాసేది సామాన్య పాఠకుణ్ణి ఉద్దేశించింది కాదు. అందువల్ల సిద్ధాంతగ్రంథానికి నేరుగా ఉపయోగించే సామగ్రిని మాత్రం ఉపయోగించుకొని మిగిలిన సామగ్రిని తర్వాత ఎప్పుడైనా ఉపయోగించుకోవచ్చు.

## కూర్పు – చేర్పు :

ఈ దశలో సేకరించిన సామగ్రికి కూర్పులు చేర్పులు అవసరం కావచ్చు. అందువల్ల అధ్యాయాలకు తగ్గట్లుగా మనం సేకరించిన సామగ్రిని ముందు అమర్చుకోవాలి. సిద్ధాంత గ్రంథానికి ఒక ప్రారంభ మని, మధ్యభాగ మని, అంత్యభాగ మని ఉంటాయి. ముఖ్యమైన ఈ మూడు భాగాలకు, వాటిలోని ఉప విభాగాలకు తగినట్లుగా మనం తయారు చేసుకున్న టిప్పణి చీటీలను కూర్చు కోవాలి. ప్రారంభ దశలోనే సిద్ధాంతగ్రంథాని కొక సారాంశాన్ని తయారు చేసుకొని ఉంటాం కాబట్టి, దాని ప్రకారం ఈ చీటీలను అమర్చుకోవచ్చు.

సిద్ధాంత గ్రంథంలోని ప్రారంభంలో ప్రవేశిక ఉంటుంది. మనం ఎలాంటి సమస్యను ఎన్నుకున్నామో, దాని స్వరూప స్వభావా లేమిటో ఇందులో చెప్తాం. సిద్ధాంత గ్రంథం చివర పరిశోధన ఫలితాలను ఆవిష్కరించడం జరుగుతుంది. దీనికి మనం సేకరించిన విషయాలకంటె మన ఆలోచన, అన్వేషణే ప్రాముఖ్యం వహిస్తుంది. ఇక సిద్ధాంత గ్రంథ భాగంలో సేకరించిన సమాచారాన్ని ఆలోచనాత్మకంగా అమర్చుకొని, విశ్లేషించి, వివేచించి, విమర్శించి, వివరించాల్సి ఉంటుంది.

వివిధ ఆకరాల నుంచి విషయాన్ని సేకరించే సమయంలోనే ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. ఈ సమస్యల్ని పరిష్కరించే సమయంలో ఎంతో ఆలోచన అవసరమవుతుంది. సమస్యల్ని, వాటికి మనకు తోచిన పరిష్కారాల్ని కూడా అక్కడికక్కడే నమోదు చేసుకోడం అవసరం. ఒకవేళ ఆ సమయంలో మనకు సరైన పరిష్కారం లభించక పోవచ్చు. అలాంటప్పుడు ఈ దశలో మళ్ళీ గాఢంగా ఆలోచించి పరిష్కారాన్ని కనుగొనడం అవసరం. పరిశోధకుడు సేకరించిన సామగ్రిని వివిధ అధ్యాయాలకు అనుగుణంగా అమర్చుకునే సమయంలోనే మధ్యమధ్య విషయానికి తగినట్లుగా వివరణలను చేర్చి ఆ అధ్యాయానికి పరిపూర్ణత కలిగేటట్లుగా చేయవచ్చు.

## ఆలోచించే కొద్దీ పరిణతి :

పరిశోధన కొరకు ప్రణాళికను ఏర్పరచుకోడం, సిద్ధాంత గ్రంథాని కొక సారాంశాన్ని తయారు చేసుకోడం, సామగ్రిని సేకరించుకోడం, దాన్ని క్రమ బద్ధంగా కూర్చి చేర్పులేమైనా ఉంటే చేయడం — అనే ఈ దశలనన్నిటినీ దాటే సరికి పరిశోధకులకు పరిణతి లభించడంలో ఆశ్చర్యం లేదు. సమగ్ర దృక్పథంతో ఆలోచన జరిపే కొద్దీ పరిశోధన మార్గం సుగమమవుతుంది.

ఏమైనా నిర్ణయాలు తీసుకొనేటప్పుడు మన ఆలోచనలు ఏవైపు పయనించాలి అనేది ముఖ్యం. ఆలోచనలు ఊహలుగా పుట్టి ఊహలుగానే నిలిచిపోతే పరిశోధన పరిపూర్ణం కాదు. ఊహించడంలో తప్పు లేదు. అయితే ఆ ఊహను

సత్యంగా నిరూపించగలగాలి. ఊహను సత్యంగా నిరూపించాలంటే ఆధారాలు కావాలి. ఆధారాల సహాయంతో నిర్ణయాలను తీసుకోడమన్నది ఈదశలో జరగవలసిన పని. ప్రారంభదశలోనో, లేక సామగ్రిని సేకరించే దశలోనో తుది నిర్ణయాలను తీసుకోడం మంచి పద్ధతి కాదు. సామగ్రిని సేకరించుకొని, సమస్యలను అర్థం చేసుకొని వాటిని గురించి బాగా ఆలోచించినప్పుడే మంచి నిర్ణయాలను తీసుకోడానికి సాధ్యమవుతుంది.

ఏదైనా సిద్ధాంతం చేసేటప్పుడు ఇతరుల ప్రభావానికి లోనుకాకుండా ఉండడం చాలాకష్టం. అందులోనూ కొందరు విద్వాంసులుకూడా ఒక్కొక్కసారి తప్పు నిర్ణయాలను తీసుకోడం, వారి ప్రభావానికి మనం లోనుకావడం జరిగితే మరింత కష్టం. ఒక విద్వాంసుడిమీద మన కెంత గౌరవం ఉన్నా ఆయన అభిప్రాయాలను తప్పక ఒప్పుకోవాలని లేదు. ఇలాంటి సమయంలోనే బలమైన ఆధారాల సహాయాన్ని తీసుకోవలసి వస్తుంది. మన సిద్ధాంతానికి ఉతగా నిలిచే ఆధారాలను ఎంత ఎక్కువ మొత్తంలో సేకరించగలిగితే అంత మేలు. సరైన ఆధారాలను చూపకుండా వ్యక్తిగత అభిప్రాయంలాగా సిద్ధాంతాన్ని చేసిన ఏ మహావిద్వాంసుని అభిప్రాయాలనైనా సరే పరిశోధకుడు తిరస్కరించవలసిందే.

ఆధారాలు లభించనప్పుడు ఆ విషయాన్ని గురించి ఆలోచించడమే మానెయ్యాలా అంటే అలా కాదు. సక్రమమైన మార్గంలో జరిపే ఆలోచనకూడా ఎంతయినా సహాయం చేస్తుంది. ఉదాహరణకు ప్రాఙ్నన్నయ యుగాన్నే తీసుకుందాం. నన్నయలాంటి మహాకవులుగాని, మహాభారతంవంటి మహాకావ్యంగాని ఏ భాషలోనైనా ఉన్నట్లుండి ఊడిపడదన్నది జగమెరిగిన సత్యం. కావ్యరచన 11వ శతాబ్దినుంచి జరుగుతున్నది అని తెలపడానికి పద్యశాసనాలే ఆధారంగా ఉన్నాయి. అంతకుముందు ఏంజరిగింది, సాహిత్యమంటూ ఉండేదా అని ఆలోచన జరపాలంటే ఊహలే ఆధారం. గాథాసప్తశతిలోని తెలుగు పదాలు, ఆంధ్ర సాహిత్యాన్ని గూర్చిన సూచనలు, క్రీస్తుశకారంభంలో తెలుగుభాష, ఆ భాషలో ఆంధ్రసాహిత్యం ఉండేవనే ఊహకు బలాన్నిస్తున్నాయి. భాషనుగూర్చి స్పష్టంగా చెప్పగల్గినా, సాహిత్యం గురించి మాత్రం స్పష్టంగా చెప్పలేక పోతున్నాం. ఇంకా

ఎక్కువ ఆధారాలు దొరికినప్పుడు మన ఊహలు సత్యమైనవా కావా అన్న విషయం తెలుస్తుంది.

నిర్ణయం తీసుకోడానికి ఎన్ని ఆధారాలు కావాలన్నది ఆ యా సందర్భాలను బట్టి ఉంటుంది. ఒక్కొక్కసారి బలమైన ఆధారం ఒకటి దొరికినా చాలు. ఒక్కొక్కసారి ఎన్నిరకాల ఆధారాలు దొరికినా నన్నెచోడుని కాల నిర్ణయం లాగానే కొన్ని సమస్యలు అపరిష్కృతంగానే నిలిచిపోతాయి.

ఏది యేమైనా వీలైన అన్ని మార్గాలలో ఆలోచించడం, ఒక నిర్ణయానికి రాలేకపోతే పునరన్వేషణ ద్వారా వీలైనన్ని ఎక్కువ ఆధారాలను సేకరించడం అవసరం.

ఈ దశలోనే పర్యవేక్షకులతో ఎక్కువగా చర్చలు జరపడం అవసరమౌతుంది. పర్యవేక్షకుల అనుభవం అనేక సమస్యల్ని పరిష్కరించడంలో సహాయం చెయ్యవచ్చు. నిర్ణయాలు తీసుకోవడంలో పరిశోధకులదే ముఖ్యపాత్ర అయినా కూడా పర్యవేక్షకుల పరిశోధనానుభవం ఎంతో సహాయం చేస్తుంది. ఇలాంటి చర్చలవల్ల పరిశోధన ఒక కొలిక్కి వస్తుంది. సిద్ధాంత గ్రంథరచనకు ఉపక్రమించడానికి తగిన నేపథ్యం లభిస్తుంది. ఇక తర్వాతి దశలో పరిశోధకులు వ్రాతప్రతి తయారీకి పూనుకోవచ్చు.

# సిద్ధాంత వ్యాస రచన

ఇంతవరకు జరిపిన పరిశీలన, శోధన, పరిశోధన, ఆలోచన, అన్వేషణ ఫలితంగా సిద్ధాంత వ్యాస రచనకు పూర్వరంగం ఏర్పడుతుంది. సిద్ధాంత వ్యాసంలో ముఖ్యంగా ఈ క్రిందిభాగా లుంటాయి.

1. ముఖపత్రం (Title Page)
2. పీఠిక (Preface) - కృతజ్ఞతలు కూడా చేర్చవచ్చు.
3. విషయసూచిక (Table of Contents).
4. అక్షర సంకేతాల పట్టిక (List of Abbreviations).
5. సిద్ధాంత వ్యాసంలోని ముఖ్య భాగం - అధ్యాయాలుగా విభజించింది.
6. అనుబంధాలు
7. ఉపయుక్త గ్రంథసూచి.

వీటిలో మొదట చేయవలసింది సిద్ధాంత వ్యాసంలోని ముఖ్య భాగాన్ని తయారు చెయ్యడమే. ఈ ప్రకరణంలో సిద్ధాంత వ్యాస రచనను గురించి, అధ్యాయాల విభజన, శైలి, విరామ చిహ్నాల ఉపయోగం మొదలైన వాటిని గురించి చర్చిద్దాం. సిద్ధాంత వ్యాస రచనలోనే భాగమైన అధస్సూచికలు మొదలైనవి విశేషంగా గమనించదగినవి కాబట్టి మరొక ప్రకరణంలో పరిశీలించవలసి ఉంటుంది. సిద్ధాంత వ్యాసంలోని ఇతర భాగాలైన ముఖపత్రం వంటి వాటిని ప్రాముఖ్యాన్ని బట్టి వేరువేరు ప్రకరణాల్లో పరిశీలించడం జరుగుతుంది.

## అధ్యాయాలు :

సిద్ధాంత వ్యాసాన్ని వివిధ అధ్యాయాలుగా విభజించడం తప్పనిసరి. అధ్యాయాలను మళ్ళీ ఉపవిభాగాలుగా చేయడం కూడా అవసరం కావచ్చు.

ప్రాధాన్యాన్ని బట్టి అధ్యాయాల్లో శీర్షికలు ఉండాలి. సామాన్యంగా ప్రతి అధ్యాయానికీ, ప్రధాన శీర్షిక ఉంటుంది. ప్రధాన శీర్షికతోబాటు పార్శ్వ శీర్షికలు, ఉపశీర్షికలు ఉంటాయి.

ప్రతి అధ్యాయాన్నీ కొత్త పుటలో ప్రారంభించాలి. ఒకవేళ వెనకటి పుటలో కేవలం ఒకటి రెండు వరుసలు మాత్రమే రాసినా కొత్త అధ్యాయాన్ని కొత్త పుటలోనే ప్రారంభించాలి. అధ్యాయం సంఖ్యను రాయడానికి కూడా కొన్ని పద్ధతులున్నాయి.

పుట పైభాగం నుంచి రెండు అంగుళాలు వదిలి మొదటి అధ్యాయం, రెండవ అధ్యాయం మొ॥న సంఖ్య తెలపాలి. మళ్ళీ టైపులో డబల్ స్పేస్ వదలి అధ్యాయం పేరు రాయాలి. అధ్యాయం సంఖ్యకంటె అధ్యాయం పేరు (రాసేట్లయితే, లేక అచ్చు వేయించేటప్పుడు) పెద్ద అక్షరాలలో ఉండాలి. టైపు చెయించేట్లయితే ఇది సాధ్యంకాదు. అధ్యాయం పేరు రాసిన తర్వాత మూడు వరసలు వదిలి అధ్యాయంలోని విషయాన్ని ప్రారంభించాలి.

ఉదా :

మొదటి అధ్యాయం ↑ రెండు అంగుళాలు వదిలి

| రెండు వరుసలు వదిలి

ప్రవేశిక

| మూడు వరుసలు వదిలి

అధ్యాయంలోని విషయం

ప్రధాన శీర్షిక పుట పైభాగంలో, అధ్యాయం సంఖ్య కింద, పుట మధ్య భాగంలో ఉంటుంది. ఇదికాక పార్శ్వశీర్షికలు, ఉపశీర్షికలు కూడా ఉంటాయి. అధ్యాయంలోని ప్రధాన విభాగాలను సూచిస్తూ పార్శ్వశీర్షిక లుంటాయి. ఈ శీర్షిక అధ్యాయంలోని విషయానికి మూడు వరుసల కింద ఉంటుంది. మళ్ళీ అధ్యాయం దీని కింద రెండు వరుసల తర్వాత మొదలవుతుంది. పార్శ్వశీర్షిక అధ్యాయంలోని విషయాన్ని మొదలుపెట్టేచోటే మొదలుపెట్టవచ్చు.

ఉదా:

అధ్యాయంలోని విషయం | మూడు వరుసలు వదిలి

పార్శ్వశీర్షిక | రెండు వరుసలు వదిలి

మళ్ళీ అధ్యాయంలోని విషయం

అధ్యాయంలో ప్రధాన విభాగాలు కాక ఇంకా ఉపవిభాగాలుకూడా ఉంటాయి. వాటికి ఉపశీర్షికలను ఉపయోగించాలి. ఈ శీర్షికలను 'మార్జిన్' నుంచి కొంతమేరకు వదిలి రాసి, కింద గీతపెట్టాలి. శీర్షిక తర్వాత పూర్ణ విరామ చిహ్నాన్ని ఉంచి తర్వాత విషయాన్ని ప్రారంభించాలి. ఈ శీర్షికలన్నిటినీ ఈ క్రింది విధంగా సూచించ వచ్చు.

ప్రధాన శీర్షిక
పార్శ్వ శీర్షిక
**ఉపశీర్షిక :**

ఏ శీర్షికైనాసరే సాధ్యమైనంతవరకు తక్కువ నిడివి కలిగి ఉండాలి.

## విషయ నివేదనం :

శీర్షికల దగ్గర్నుంచి ప్రతిదాన్నీ ఒక సక్రమమైన పద్ధతిలో సమర్పించి నప్పుడే సిద్ధాంత గ్రంథానికి పుష్టి చేకూరుతుంది. ఇక అన్నిటికంటె ముఖ్యమైంది విషయ నివేదనం. విషయాన్ని వివరించేటప్పుడు ఒక భావం తర్వాత మరొక భావం వచ్చేట్లుగా జాగ్రత్త పడాలి. ఏది వెనక చెప్పాలి, ఏది ముందు చెప్పాలి. అనే విషయాన్ని చక్కగా ఆలోచించి సిద్ధాంత వ్యాసాన్ని రచించాలి. ఆలోచనల్ని కార్యకారణ సంబంధం ఉండేట్లుగా అమర్చాలి. అవసరమైన వాటిని చేర్చడం, అనవసరమైనవాటిని పరిహరించడం, స్పష్టం చెయ్యవలసిన వాటిని స్పష్టంచెయ్యడం జరగాలి. అధ్యాయానికీ అధ్యాయానికీ, వాటిలోని వివిధ విభాగాలకూ మధ్య క్రమానుబంధం ఉండాలి.

విషయాన్ని నివేదించేటప్పుడు ఈ క్రింది విషయాలను గుర్తుంచుకోవాలి.

1. మొదట చెప్పబోయే విషయాన్ని గురించి సంక్షిప్తంగా చెప్పాలి. 2. సేకరించిన సామగ్రిని ఒక క్రమంలో సమర్పించాలి. 3. పరిశోధించిన క్రమాన్ని వివరిస్తూ తన అభిప్రాయాన్ని స్పష్టం చెయ్యాలి. 4. తర్వాత చెప్ప బోయే విషయాలను సూచించాలి.

సిద్ధాంత వ్యాసశైలి ఎలా ఉండాలన్నదికూడా పరిశోధకులు తెలుసుకో వలసిన ముఖ్య విషయాలలో ఒకటి. సిద్ధాంత వ్యాసాన్ని విశ్వవిద్యాలయానికి సమర్పించేముందు రచనలో దోషాలను, అక్షర దోషాలను, విరామ చిహ్నాల దోషాలను చక్కగా పరిశీలించి పరిహరించడం పరిశోధకుల కర్తవ్యం. చిన్న చిన్న విషయాలనుకూడా శ్రద్ధగా పరిశీలించి నిర్దుష్టంగా తీర్చిదిద్దే అలవాటు ప్రతి పరిశోధకుడికి ఉండితీరాలి. నిర్దుష్టంగా ఉండడం, మితిమీరని విషయ నివేదనం, అర్థం స్పష్టంగా సరళంగా ఉండడం సిద్ధాంత వ్యాస లక్షణాలు. సిద్ధాంత వ్యాసంలో సాధ్యమైనంతవరకు ఆలంకారిక శైలిని పరిహరించడం మంచిది. అలాగని నీరసరచన చెయ్యాలని లేదు. అయితే మనోహరశైలి చెప్పా లనుకున్న అర్థాన్ని అస్పష్టంచేసే ప్రమాదం ఉంది. అందువల్ల చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, స్పష్టంగా, సరళంగా, సాధారంగా చెప్పడానికే ప్రాధాన్యం ఇవ్వాలి.

సిద్ధాంత వ్యాసంలో సరళంగా రాయడమొక్కటే పరిశోధకుల లక్ష్యం కారాదు. పారిభాషిక పదాలను వాడడం వల్ల, నూత్న విషయాలను ప్రతిపా దించడంవల్ల ఒక్కొక్కసారి శైలి క్లిష్టం కావచ్చు. అంతేకాని కేవలం భాష క్లిష్టంగా చేసి అర్థం కాకుండా చెయ్యడం సరికాదు. మొత్తంమీద సిద్ధాంతవ్యాసం విషయానికి సంబంధించినంతవరకు గంభీరంగా, భాషకు సంబంధించినంత వరకు సరళంగా ఉండాలని తెలుసుకోవాలి.

సిద్ధాంతవ్యాసం ముఖ్యంగా పరిశోధన ఫలితాలను తెలిపేది. రచయిత శైలీ విన్యాసాన్ని, రచనలోని అందాన్ని తెలుసుకోడానికి సిద్ధాంతవ్యాసం వేదిక కారాదు. శైలి బాగుండి విషయ నివేదనం బాగా లేకుంటే పరిశోధకునికి ప్రయోజనం సిద్ధించదు. శైలివల్ల పరిశోధన విలువ హెచ్చదని తెలుసుకోవాలి. సిద్ధాంత వ్యాసంలోని వాక్యాలు చిన్న చిన్నవిగా ఉండాలి. అనేక భావాల్ని ఒకే వాక్యంలో చెప్పే సంక్లిష్ట శైలి విషయ నివేదనానికి పనికి రాదు.

ఆధారాలను చూపించడం విషయ నివేదనంలో ముఖ్యమైంది. మామూలు వ్యాసాలలోనూ, ఉబుసుపోక రచనలలోనూ, వార్తా పత్రికల్లో ప్రచురించే జన ప్రియ రచనలలోనూ రాసినట్లుగా ఆధారరహితంగా రాయకూడదు. ఉదాహృత వాక్యాల సహాయంతో, అధస్సూచికల సహాయంతో ఇతరుల అభిప్రాయాలను స్పష్టంగా సూచించాలి. ఇతరుల అభిప్రాయాలు కూడా తమ అభిప్రాయాలుగానే రాయడం పరిశోధకులు చేయకూడని పని. ఇతరుల అభిప్రాయాలను అధస్సూచి కల ద్వారా సూచించి తమ అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పగలిగినవారే నిజంగా పరిశ్రమించిన ఉత్తమ పరిశోధకులు. ఉదాహృత వాక్యాలను గురించి, అధస్సూచి కలను గురించి ప్రత్యేక ప్రకరణాలలో చెప్పడం జరుగుతుంది.

ఇతరుల అభిప్రాయాలను విమర్శించడం తప్పనిసరి కావచ్చు. పరిశోధ కులు సేకరించిన ఆధారాలవల్ల ఇతరుల అభిప్రాయాలు తప్పని నిర్ధరించగలిగి నప్పుడే వారి అభిప్రాయాలను విమర్శించాలి. మనం విమర్శిస్తున్నది అభిప్రాయా లనే గాని వ్యక్తులను కాదనే విషయం గుర్తుంచుకోవాలి. ఎంత గొప్పవారి అభి ప్రాయ మైనా తప్పయినప్పుడు తప్పు అని చెప్పడానికి వెనుకాడరాదు. అలాగే విమర్శించేటప్పుడు కూడా అత్యంత సంయమం చూపాల్సిన అవసరమూ ఉంది. అవహేళన, కటూక్తి, వ్యంగ్యం కూడదు. దాక్షిణ్యం లేని, అసహనం లేని సత్య దృష్టితో గూడిన విమర్శ అభిలషణీయం. ఇతరుల పేర్లను రాసేటప్పుడు శ్రీ. ప్రొ॥ డా॥ అని ముందుగాని, పేరు తర్వాత 'గారు' అని గాని రాయవచ్చు. ఏదో ఒక్కటి చాలు. పూజ్యులైన, మహా విద్వాంసులైన, నా గురువర్యులైన వగైరా విశేషణాలు అనవసరం.

సిద్ధాంతవ్యాసంలో సాధ్యమైనంతవరకు 'నేను ఇది చేశాను, అది చేశాను, నేను రాసిన ఆ పుస్తకం, నేను రాసిన ఆ వ్యాసం' వంటి మాటలు రాయకపోవడం మంచిది. విషయానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలిగాని వ్యక్తికి కాదు. రచయిత శైలి పరాశ్రయం (objective) గా లేక వస్త్వాశ్రయంగా ఉండాలే గాని ఆత్మాశ్రయం (subjective)గా ఉండరాదని దీని అర్థం.

చదువరులకు ఏమీ తెలియదనే దృష్టితో సిద్ధాంతవ్యాసాన్ని రాయకూడదు. సిద్ధాంతవ్యాస మనేది ఆయా క్షేత్రాలతో కొంత పరిచయం, పరిశ్రమ ఉన్నవారికోసం ఉద్దేశించిందని గుర్తుంచుకోవాలి. అందువల్ల సామాన్య విషయాలను గురించి ఎక్కువ సమాచారం అందజేయడం అనవసరం. 'ఈ విషయం మనవారికి తెలియకపోవచ్చు...' 'ఈ క్షేత్రంలో ఇతరుల కృషి అంతంత మాత్రమే. నా సాధన చాలా గొప్పది' వంటి మాటలు పరిశోధకులు ఉపయోగించకూడదు.

**గమనించాల్సిన మరికొన్ని విషయాలు :** వ్యక్తుల పేర్లు రాసేటప్పుడు అందరికీ పరిచయమున్న విధంగా రాయాలి. ఉదా॥ శ్రీశ్రీ అని రాయాలి, శ్రీరంగం శ్రీనివాసరావు అని కాదు. పుస్తకాల పేర్లు మరీ దీర్ఘంగా ఉంటే సంకేతాక్షరాలతో సూచించవచ్చు. కాని, అన్నిచోట్లా ఒకే రకమైన సంకేతాక్షరాలను వాడాలి. అలాగే సిద్ధాంతవ్యాసంలో పదేపదే వాడవలసివచ్చే పుస్తకాలకు సంకేతాక్షరాలను వాడవచ్చు. అయితే ఆ సంకేతాక్షరాలు ఒకేవిధంగా వాడడం అవసరం. వీటన్నిటినీ గ్రంథాదిలో వివరించాలి.

నూరుకంటె తక్కువ సంఖ్యలను అక్షరాలలోనే రాయాలి, సంఖ్యలలో కాదు. ఉదా॥ పది, అరవై రెండు, తొంభై తొమ్మిది. నూరుకంటె ఎక్కువ సంఖ్య అయితే అంకెలే వెయ్యవచ్చు లేక అక్షరాలలోనే రాయవచ్చు. ఫలాని సంవత్సరంనుంచి ఫలాని సంవత్సరం వరకు అని రాయాల్సివస్తే కొన్ని పద్ధతు లున్నాయి. వెయ్యికంటె తక్కువ సంఖ్యలయితే పూర్తిగా రాయాలి. ఉదా॥ 728–999. పెద్ద సంఖ్యలను రాసేటప్పుడు రెండో సంఖ్య మొదటి సంఖ్యలోని

వంద సంవత్సరాలలోపుదైతే రెండంకెలను రాస్తే చాలు. ఉదా॥ 1948-84. ఇది సంవత్సరాల విషయానికే కాక ఏ సంఖ్యలకైనా వర్తిస్తుంది. ఉదాహరణకు 1868 వ పుట నుంచి 1871 వ పుటవరకు అని సూచించాలంటే 1868-71 అని రాస్తే చాలు. చివరిసంఖ్య అదే వందలోపుది కాకుంటే పూర్తిగా రాయాలి. ఉదా. 1562-1786.

సంవత్సరాలను రాసేటప్పుడు క్రీస్తుశకమా, శాలివాహనశకమా అన్నది సూచించాలి. క్రీస్తుశకాన్నే ఎక్కువగా వాడేటప్పుడు ఏ సంకేతాక్షరాన్నీ వాడకుంటే అది క్రీస్తుశకం అన్న విషయాన్ని గ్రంథావిలో సూచించాలి.

## విరామ చిహ్నాలు :

విరామ చిహ్నాలను వాడడంలో ముఖ్యోద్దేశం ఏదైనా విషయాన్ని స్పష్టం చేయడం. పూర్ణ విరామాలు, అల్పవిరామాలు మొదలైనవి ఆయా వ్యక్తుల శైలికి సంబంధించినవి. అయితే వాడవలసిన చోట్ల వీటిని తప్పక వాడాలి.

ఆశ్చర్యార్థకాలను సాధ్యమైనంత తక్కువగా వాడాలి. ఏదైనా పదం తర్వాత అల్పవిరామ చిహ్నాన్నీ, బ్రాకెట్‌నూ వాడవలసివస్తే, బ్రాకెట్ తర్వాతనే అల్పవిరామ చిహ్నాన్ని వాడాలి. 'తెలుగు-కన్నడ జానపద గేయాలు'-ఇలాంటివి రాయాల్సివస్తే 'తెలుగు' తర్వాత ఉండే చిన్న (Hyphen) ఆ వరుసలో చివర రాయకూడదు. ఎందుకంటే ఆవిధంగా రాస్తే అచ్చు వేసేటప్పుడు 'తెలుగు - కన్నడ' బదులుగా 'తెలుగు కన్నడ' అని ముద్రాపకులు అచ్చువేసే ప్రమాదం ఉంది. వాక్యం చివర బ్రాకెట్ వచ్చేట్లతే, బ్రాకెట్ తర్వాతే పూర్ణవిరామ చిహ్నం వాడాలి.

# అధస్సూచికలు – ఉల్లేఖాలు– ఉదాహృతాలు

సిద్ధాంత వ్యాసరచనలో భాగంగానే అధస్సూచికలు మొదలైన వాటిని గురించి చెప్పవలసిఉంది. కాని, విశేష పరిశీలన ఆవశ్యకం కాబట్టి పైవాటిని గురించి ప్రత్యేక ప్రకరణంలో చెప్పడం జరుగుతున్నది.

అధస్సూచికలు (Foot notes) ఇచ్చేటప్పుడు తగినంత జాగ్రత్త వహించ వలసి ఉంటుంది. ఇటీవల కొన్ని సిద్ధాంత గ్రంథాలలో తగినంత శ్రద్ధ తీసుకోక అధస్సూచికల్ని ఇష్టం వచ్చినట్లు వాడిన సందర్భాలున్నాయి. అధస్సూచికల్ని ఎప్పుడు వాడాలి, ఉల్లేఖాలు (References) ఎక్కడెక్కడ ఇవ్వాలి. ఉదాహృత వాక్యాలు (Quotations) ఎంతవరకు అవసరమౌతాయి- ఇలాంటి విషయాలను పరిశోధకులు తప్పక తెలుసుకోవాలి.

## అధస్సూచికలు :

సిద్ధాంత వ్యాసంలో మొదటినుంచి చివరి వరకూ అక్కడక్కడా అవసర మయ్యేవి అధస్సూచికలు. మనం ఎవరి అభిప్రాయమైనా వెల్లడించేటప్పుడు, ఆ అభిప్రాయానికి ఆధారాన్ని తెలపడం అవసరం. అలాంటప్పుడు అధస్సూచిక అవ సరమౌతుంది. కొన్ని పదాలను వివరించాల్సినప్పుడు, కొన్ని విషయాలను స్పష్టం చెయాల్సినప్పుడు టిప్పణి రూపంలో అధస్సూచికలను ఇవ్వవలసి వస్తుంది. పాఠకులకు ఎక్కువ సమాచారం ఎక్కడ దొరుకుతుందో తెలపడానికి కూడా అధస్సూచికలు ఉపయోగపడతాయి. సిద్ధాంతవ్యాసంలో మరేదైనా భాగాన్ని చూడమని చెప్పడానికి, ఇతర అధస్సూచికలను చూడమని చెప్పడానికి కూడా వీటిని ఉపయోగించడం జరుగుతుంది. ఏదైనా అనువాదభాగాన్ని సిద్ధాంత

వ్యాసంలో ఇచ్చినప్పుడు దానిమూలాన్ని ఇవ్వడానికి కూడా అధస్సూచికను ఉపయోగించుకోవచ్చు. ఇతరుల విషయాలను వాడుకున్నపుడు వారికి కృతజ్ఞతలు చెప్పడానికీ ఇవి ఉపయోగపడతాయి.

ఏదైనా విషయాన్ని గూర్చి భిన్నాభిప్రాయా లున్నప్పుడు, సిద్ధాంత వ్యాసభాగంలో అనవసర చర్చలు పోకుండా, అధస్సూచికల్లో అవసరమైనంత మేరకు ఆ అభిప్రాయాల సారాన్ని ఇవ్వవచ్చు. అలాగే ఏదైనా చిన్న విషయం సిద్ధాంత వ్యాసంలో మనం రాస్తున్న ధాటికి అడ్డువస్తుందని తోస్తే అలాంటిదాన్ని అధస్సూచికల్లో చేర్చెయ్యవచ్చు.

వీటన్నిటికంటె ముందు ఏది అధస్సూచికగా చెయ్యాలి, ఏది అసలు గ్రంథంలో చేర్చాలి అన్నదాన్ని గురించి పరిశోధకులు కొంత ఆలోచించాలి. సిద్ధాంత వ్యాసం ఏకధారగా, సాధారంగా, కుంటుపడకుండా సాగాలి. ఎక్కడైనా ఈ ధారకు భంగం కలుగుతుందనుకుంటే అలాంటి విషయాలను అధస్సూచికల్లో చేర్చాలి అన్నది మొదట గమనించాలి. అందువల్ల పైన చెప్పిన సందార్భాలన్నీ ఈ విధంగా అడ్డుతగిలే అవకాశం ఉండేవి కాబట్టి అధస్సూచికల్లో చేర్చడానికి తగినవని భావించాలి.

**అధస్సూచికలను ఎక్కడ రాయాలి, ఎలా రాయాలి ? :-** అధస్సూచికలను మూడు రకాలుగా వ్రాయవచ్చు. (1) పుటకు క్రింది భాగంలో, (2) అధ్యాయం అయిన తర్వాత, (3) సిద్ధాంత వ్యాసం చివర.

అధస్సూచికలు ఎక్కువగా నున్నప్పుడు 1, 2, 3 అని సంఖ్యలు ఇచ్చుకుంటూ పోవచ్చు. లేకుంటే నక్షత్రంగుర్తులాంటివి ఇవ్వవచ్చు (ఒకటి రెండు అధస్సూచికలు మాత్రం ఉంటే). సిద్ధాంత వ్యాస భాగంలో అధస్సూచికలకు సంబంధించిన గుర్తులను సూచించేటప్పుడు ఆయా స్థలాలలో 1, 2, 3 వంటి సంఖ్యలను మామూలు అక్షరాల వరుసకు కొంత పైభాగంలో రాయాలి. అధస్సూచికలో కూడా ఈ సంఖ్యలను అదే విధంగా రాయాలి. అధస్సూచికలను రాసేటప్పుడు పుటక్రింద కావలసినంత మేరకు (అంటే ఎన్ని అధస్సూచికలు

ఉన్నాయో, దానికి కావలసినంత) స్థలం వదలాలి. సిద్ధాంత వ్యాస భాగంలోని చివరి వాక్యం తర్వాత రెండు వరసలు వదలి ఒకటిన్నర అంగుళం గీత ఒకటి గీయాలి. దాని క్రింద అధస్సూచికలు ఒక్కొక్కటి ఒక్కొక్క పేరాగా రాసు కుంటూ పోవాలి.

**ఉదా :**

---

ప్రాచీన కన్నడ కవులు 'జనపద'మనే శబ్దాన్ని దేశమనే అర్థంలో ప్రయోగించారు. కావేరి నుంచి గోదావరివరకు కన్నడ దేశం వ్యాపించి ఉందని తొమ్మిదవ శతాబ్దికి చెందిన 'కవిరాజమార్గం'లో ఉంది.[1] ప్రముఖ విద్వాంసుడు అలన్ డండస్, జానపదులు కేవలం గ్రామవాసులే కానక్కరలేదని, నగరంలో కూడా అలాంటి మనస్తత్వం ఉన్నవారు ఉండవచ్చుననీ 'ఫోక్' శబ్దాన్ని వివరిస్తూ చెప్పాడు.[2]

1. కావేరియింద మా గో
   దావరి వరమిర్ద నాడదా కన్నడదొళ్
   భావిసిద జనపదం వసు
   ధానళయ విలీన విశద విషయ విశేషం (1-36)

2. "There are still some foltlorists who mistakenly identify the folk with peasant society or rural groups. If one were to accept this narrow conception of folk, then by definition one would have to conclude that city dwellers were not folk and hence city dwellers could have no folklore", The Study of Folklore, P. 2

---

ఒకవేళ అధస్సూచికలను అధ్యాయం చివరగాని, సిద్ధాంత గ్రంథం చివరగాని ఇచ్చేట్లయితే ప్రధాన శీర్షికగా—

అధస్సూచికలు

అని మధ్యలో రాయాలి, లేక టైపు చెయ్యాలి. అయితే సాధ్యమైనంత వరకు సిద్ధాంత గ్రంథాలలో అధస్సూచికలను ఆయా పుటలలోనే ఇవ్వడం మంచిది. దీనివల్ల చదివేవారికి మాటిమాటికీ పేజీలు తిప్పేశ్రమ తప్పుతుంది.

కొత్త పేరాగ్రాఫ్ రాసేటప్పుడు ఏ విధంగా అయితే మనం కొంత ఖాళీ వదలి రాస్తామో అలాగే ఒక్కొక్క అధస్సూచికను ఇచ్చేటప్పుడు ఖాళీ వదలాలి. ఒక అధస్సూచిక కాగానే మరొకటి రాసేటప్పుడు రెండు వరసలు ఖాళీ వదలాలి.

**గమనించాల్సిన మరికొన్ని విషయాలు :** ఒకవేళ అధస్సూచికను ఇస్తుండగా పుట పూర్తి అయిపోతే వాక్యాన్ని మధ్యలోనే ఆపి, ఒక చిన్న గీత పెట్టి, పక్క పుటలోకి తీసుకువెళ్ళడం మంచిది. ఎందుకంటే వాక్యాన్ని అక్కడి కక్కడే పూర్తి చేస్తే ఇంక ముందు దీనికి సంబంధించిందేమీ లేదని పొరపాటు పడే ప్రమాదం ఉంది.

అధస్సూచికలను ఒకటికి రెండు సార్లు బాగా సరిచూడాలి. ఇవి ఇతరులకు సంబంధించినవి కాబట్టి సాధ్యమైనంతవరకు ఒక్క పొరబాటు కూడా రాకుండా చూచుకోవాలి.

అధస్సూచికలలో చాలా రకాలున్నాయి. వాటిలో ఏ రకాన్నయినా ఎంచుకున్నప్పుడు సిద్ధాంత వ్యాసంలో చివరి వరకు దాన్నే పాటించాలి. ఒక్కొక్క చోట ఒక్కొక్క విధంగా వాడకూడదు. ఇవి సాధ్యమైనంత సంక్షిప్తంగా, సూటిగా ఉండాలి. అయితే చూడగానే అర్థమయ్యేట్లుండాలి. స్పష్టంగా తెలియకుంటే అసలు అధస్సూచిక వల్ల చేకూరే ప్రయోజనం ఉండదు.

అధస్సూచికలను టైపు చేయించేటప్పుడు ఒక్కొక్క పంక్తి అంతరం ఉంటే చాలు. అయితే ఒక్కొక్క అధస్సూచికకూ మధ్య మాత్రం రెండు పంక్తుల అంతరం ఉండాలి అధస్సూచిక చిన్నదైనా, పెద్దదైనా చివర పూర్ణ విరామం తప్పనిసరి.

ఒక అధ్యాయాని కంతటికీ కలిపి వరుసగా అధస్సూచికలకు సంఖ్యలను ఇచ్చుకుంటూ పోవచ్చు. కాని, ఆ యా పుటల్లో ఎన్నిటిని చేర్చితే అన్ని సంఖ్యలను మాత్రం వాడడమే ఎక్కువగా కనిపిస్తుంది.

ఈ కొన్ని సూచనలను దృష్టిలో ఉంచుకొని రకరకాల అధస్సూచికలను గురించి తెలుసుకోవలసి ఉంది.

**1. ఏవైనా పద్యాలు ఇవ్వవలసినప్పుడు—**

అధస్సూచికలో ఏవైనా పద్యాలు ఇవ్వవలసివస్తే అది ఏ ఆశ్వాసంలోది, ఎన్నో పద్యం అన్నది సూచించవలసి ఉంటుంది. ఉదాహృత పద్యం ప్రసిద్ధ కావ్యంలోది కాకుంటే, ఆ కావ్యం ఎవరు రాసింది, ఎవరు సంపాదకులు, ప్రచురణ వివరాలు మొదలైనవి కూడా ఇవ్వాలి.

**2. అనువాదానికి మూలం ఇవ్వవలసినప్పుడు—**

సిద్ధాంత వ్యాసంలో ఏవైనా వాక్యాలకు అనువాదం ఇచ్చినప్పుడు దాని మూలాన్ని అధస్సూచికలో ఇవ్వాలి. ఒకవేళ ఇవ్వడానికి వీలులేకుంటే, లేక ఇచ్చినా ప్రయోజనం లేకుంటే కనీసం తను చేసింది అనువాదమనీ, ఆ అనువాదం తనది కాకుంటే మరొకరిదనీ స్పష్టంగా సూచించవలసి ఉంటుంది. అధస్సూచికలో మూలాన్ని ఇచ్చినప్పుడు, దాని రచయిత మిగిలిన వివరాలు ఇవ్వాలి.

**3. వివరించాల్సినప్పుడు—**

ఒక్కొక్కసారి సిద్ధాంత వ్యాసంలోని కొన్ని పదాలకు వివరణ ఇవ్వవలసి రావచ్చు. ఒక్కొక్కసారి కొన్ని విషయాలను బాగా అర్థమయ్యేట్లుగా చెప్పవలసిరావచ్చు. ఈ వివరణ సాధ్యమైనంత సంక్షిప్తంగా ఉండడం అవసరం. అధస్సూచిక ఒక్కొక్క పుటదాటి తర్వాతి పుటల్లోకి అనవసరంగా విస్తరించుకుంటే బాగుండదు. అందువల్ల ఒకటికి రెండుసార్లు ఆలోచించి ఎంతవరకు వివరణ అవసరమో అంతే ఇవ్వాలి.

**4. పుస్తకాలకు సంబంధించిన వివరాలు—**

అధస్సూచికలలో ఎక్కువ భాగం ఇవే ఉంటాయి. అందువల్ల అధస్సూచికలను గురించి చెప్పేటప్పుడు ముఖ్యంగా వీటినే చెప్పడం జరుగుతుంటుంది. పుస్తకాలకు సంబంధించిన అధస్సూచికల్ని ఇచ్చేటప్పుడు గమనించాల్సిన విషయాలను గురించి ఇఙ్గ్లీషులో చాలా పుస్తకాలు కొన్ని ప్రమాణాలను ఏర్పరచాయి. ఈ ప్రమాణాలను తెలుగులోకి తెచ్చుకొని వాటిని సక్రమంగా అనుసరించడం అవసరం.

అధస్సూచికలో ఈ క్రింది విషయాలను పొందుపరచాలని మొదట తెలుసుకోవాలి.

౧. గ్రంథకర్త పేరు
౨. పుస్తకం పేరు
౩. ప్రచురణ కర్త
౪. ప్రచురణ స్థలం
౫. ప్రచురించిన సంవత్సరం
౬. ప్రసక్త విషయం ఉండే పుట.

పై వివరాలు గనుక ఇస్తే అధస్సూచికను సక్రమంగా, సంపూర్ణంగా ఇచ్చినట్లవుతుంది. ముఖ్యంగా గ్రంథకర్త పేరు, పుస్తకం పేరు, ప్రచురించిన సంవత్సరం, పుట అయినా ఇవ్వాలి. మిగిలిన వివరాలు కావాలంటే చివర ఇచ్చే ఉపయుక్తగ్రంథసూచిలో ఇవ్వవచ్చు. కాని ఏ వివరాలు ఇవ్వకుండా ఊరక గ్రంథకర్త పేరో, పుస్తకం పేరో ఇచ్చి ఊరుకోవడం మంచిదికాదు. పరిశోధకుని అలక్ష్యాన్ని, అనాసక్తిని అది సూచిస్తుంది.

అధస్సూచికలో గ్రంథకర్త పేరు ఇచ్చేటప్పుడు మామూలుగా మనం తెలుగులో పేరు రాసుకొనే విధంగా మొదట ఇంటి పేరు, తర్వాత అసలు పేరు రాయాలి. ఉపయుక్త గ్రంథ సూచిలో అయితే మొదట అసలు పేరు, తర్వాత ఇంటి పేరు వగైరా రాయాలి. (ఉదా॥ భానుమూర్తి, వారణాసి, వెంకట).

అధస్సూచికలో ఇచ్చిన గ్రంథాలన్నీ ఉపయుక్తగ్రంథసూచిలోకి ఎక్కాలి. ఉపయుక్త గ్రంథ సూచిలో అన్ని వివరాలూ ఉంటాయి. కాబట్టి మనం ఇక్కడ చెప్పిన విషయాలను సమగ్రంగా తెలుసుకోగోరినవారు ఆయా పుస్తకాలను చూచుకోవచ్చు.

**పుస్తకాల విషయాలను సూచించే పద్ధతులు :**

౧. ఒకే రచయిత రాసిన పుస్తకం :

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, సారస్వతాలోకము,
త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం, 1966, పు. 50.

ఒకవేళ రచయిత పేరును సిద్ధాంత వ్యాస భాగంలోనే ఇచ్చి ఉంటే మిగిలిన వివరాలను మాత్రం అధస్సూచికలో ఇస్తే చాలు.

౨. ఇద్దరు ముగ్గురు రాసిన పుస్తకం.

రచయితల పేర్లను గ్రంథంలో ఇచ్చిన క్రమంలోనే ఇస్తూ మిగిలిన వివరాలు ౧ వ దానిలో లాగానే ఇవ్వాలి.

౩. సంపాదకత్వం వహించిన పుస్తకం :

ఏదైనా పుస్తకం రచించింది కాక, సంపాదకత్వం వహించిందైతే ఆ విషయాన్ని తెలిపాలి.

శర్మ, సంపా , అని గాని శర్మ (సం.), అనిగాని ఇచ్చి మిగిలిన వివరాలన్నీ ఇవ్వాలి.

౪. అనువాదం :

మూర్తి (అను.), అని ఇచ్చి మిగిలిన వివరాలన్నీ ఇవ్వాలి.

౫. అముద్రిత సిద్ధాంత వ్యాసం మొ॥వి.

బిట్టు వేంకటేశ్వర్లు, పల్నాటి సీమలో కోలాటం (అముద్రిత సిద్ధాంత వ్యాసం). నాగార్జున విశ్వవిద్యాలయం—

అని ఇచ్చి మిగిలిన వివరాలు ఇవ్వాలి.

౬. మలి ముద్రణ వంటివి.

అన్ని వివరాలు ఇస్తూ రెండవ పరిష్కృత ముద్రణ, మలి ప్రచురణ, నాల్గవ ముద్రణ - ఈ విధంగా, నిర్దిష్టంగా చెప్పి, సంవత్సరం ఇవ్వాలి

౭. అనేక సంపుటాలున్న పుస్తకమైతే.

ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యం, సం. 5 - ఇలా ఇచ్చి మిగిలిన వివరాలు ఇవ్వాలి.

౮. సంకలనంలోని ఏదో ఒక వ్యాసాన్ని గురించి చెప్పవలసి వచ్చినప్పుడు.

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, సారస్వతాలోకము,

"త్యాగయ్య గారి నాదసుధారసం" - అని వ్యాస శీర్షికను ఉదాహృత వాక్యంగా ఇవ్వాలి.

౯. పత్రికల నుంచి తీసుకున్నప్పుడు.

1. మొదట రచయిత పేరు 2. వ్యాసం శీర్షిక (ఉదాహృత చిహ్నాలలో) 3. పత్రిక పేరు 4. సంపుటం, సంచిక 5. తేది లేక సంవత్సరం, నెల 6. పుట సంఖ్య.

౧౦. వివరాలు తెలియనప్పుడు,

కొన్ని తెలుగు పుస్తకాలలో ప్రచురణ సంవత్సరం, ఎన్నవ ముద్రణ అన్నది, ప్రచురణకర్తల పేర్లు మొదలైనవి ఉండవు. అలాంటప్పుడు పుస్తకం పేరు ఇచ్చి - వివరాలు తెలియదు - అనైనా రాయాలి.

**ఒకే గ్రంథాన్ని మళ్ళీమళ్ళీ చెప్పాల్సివస్తే అనుసరించాల్సిన పద్ధతులు:**

౧. ibid. ఇంగ్లీషులో ibidem (అదే స్థలంలో) అనేదాన్ని సూచించడానికి ibid. అని వాడుతుంటారు. తెలుగులో 'అదే' అని వాడవచ్చు. ఉదా:

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, సారస్వతాలోకము, త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం, 1966, పు. 50.

అదే, పు. 52.

ఒక పుస్తకాన్ని సూచించిన తర్వాత వెంటనే అదే పుస్తకాన్ని చెప్పాల్సినప్పుడు మాత్రం ఈ విధంగా వాడాలి. పుట సంఖ్యలో తేడా ఉంటే దాన్ని మాత్రం సూచిస్తే చాలు.

౨. loc - cit ఇంగ్లీషులో loco citato (అదే నిర్దిష్ట స్థలంలోది) అనే దాన్ని సూచించడానికి Loc, cit. అని వాడుతుంటారు. ఒక పుస్తకంలోని ఒక పుటను సూచించి మళ్ళీ అదే పుస్తకం, అదే పుటను వెన్వెంటనే కాక కొన్ని అధస్సూచికల తర్వాత చెప్పాల్సివస్తే loc, cit, అని వాడుతారు. దీనికి తెలుగులో పూర్వోక్తం అని వాడవచ్చు. ఉదాహరణకు తిక్కన భారతాన్ని గురించి చెప్పి మళ్ళీ కొన్ని సూచికల తర్వాత అదే పద్యం చెప్పాల్సి వస్తే - తిక్కన భారతం, పూర్వోక్తం అని రాయాలి. పుట సంఖ్య వెయ్యనక్కర లేదు.

౩. op. cit ఇంతకు ముందు చెప్పిన loc. cit. ను దీన్ని ఒకేరకంగా వాడుతుంటారుగాని అది సరిగాదు. loc cit. అన్నది ఒకే పుస్తకంలోని ఒకే పుటను మళ్ళీ చెప్పడానికి ఉపయోగించేది. అక్కడ పుటసంఖ్య వెయ్యనక్కర లేదు. op. cit. అన్నది ఒకే పుస్తకంలో వేరే పుటను తెలిపేది. అందువల్ల ఇక్కడ పుట సంఖ్యను తప్పనిసరిగా ఇవ్వాలి. ఉదా :

శర్మ, మహాభారత విమర్శ, భారత ప్రచురణలు, మద్రాసు. 1965, పు. 50.

....................మధ్యలో మరికొన్ని అధస్సూచికలు శర్మ, పూర్వోక్తం, పు. 54.

ఒక అధస్సూచిక తర్వాత వెంటనే అదే పుస్తకాన్ని చెప్పాల్సివస్తే ఆదే (ibid.) అని వాడాలని చెప్పుకున్నాం. అలా వెంటనే రాకుండా కొన్ని అధస్సూచికల తర్వాత వస్తే పైన చెప్పిన విధంగా రాయాలి.

**గమనించాల్సిన మరికొన్ని అంశాలు :**

1. అధస్సూచికల విషయంలో ఒక పద్ధతిని అనుసరించినప్పుడు చివరివరకు అదే పద్ధతిని అవలంబించాలి. ఒక్కొక్క పుటలో, అధ్యాయంలో ఒక్కొక్కవిధంగా రాయకూడదు.
2. అధస్సూచికల్లో ఇచ్చిన పేర్లు, ప్రచురణకర్తలు, సంవత్సరాలు, పుటలు ఒకటికి రెండుసార్లు సరిచూచుకోవాలి. ఇది చాలా ముఖ్యం.
3. సంక్షిప్తత వీటిలో చాలా ముఖ్యం. అనవసరంగా పెంచుకు పోయేకొద్దీ అధస్సూచికలవల్ల సమస్యలు ఎదురవుతాయి. అలాగని అస్పష్టంగా చెప్పడమూ మంచిదికాదు.
4. అధస్సూచిక అనేక పుటలవరకు విస్తరించుకునేట్లయితే దాన్ని ప్రత్యేకానుబంధంగా చేర్చడమే మంచిదేమో పరిశీలించాలి.

## ఉల్లేఖాలు :

అధస్సూచికలను గురించి అనేక విషయాలు తెలుసుకున్నాం. ఒకవేళ పరిశోధకుడు ఒకే పుస్తకాన్ని పదేపదే ఉల్లేఖించాల్సి ఉంటుందనుకుందాం. అలాంటి ఉల్లేఖాలు (References) అధస్సూచికలో ఇస్తూ పోవాలంటే కష్టం. ఉదాహరణకు మహాభారతమో, రామాయణమో, భాగవతమో పరిశోధన విషయంగా ఎంచుకున్నారనుకుందాం. ఆయా పుస్తకాల్ని సిద్ధాంతగ్రంథంలో ప్రతి పుటలో ఏదోఒక విధంగా చెప్పాల్సి ఉంటుంది. అలాంటప్పుడు అధస్సూచికల్లో-

1. మహాభారతం, ఆది (2-10)
2. అదే, ఆది. (2-16)
3. అదే. సభా. (1-18)
4. అదే, అరణ్యా. (2-34)
5. అదే, అరణ్యా. (2-38)

ఈ విధంగా ఇచ్చుకుంటూ పోతే అధస్సూచికలు కొండవీటి చేంతాడంత పెరిగిపోతాయి. ఇలాంటి వాటిని "హార్వర్డ్ ఉల్లేఖ విధానం" (Harward

System of Referencing) ద్వారా సూచించవచ్చు. దీని ప్రకారం ప్రధాన మైన ఉల్లేఖాల తర్వాత బ్రాకెట్లో రచయిత పేరు, గ్రంథం ప్రచురణ సంవత్సరం, పుటసంఖ్య మాత్రం ఇస్తేచాలు.

(శర్మ, 1968, పు. 112)

ఇంతకూడా వద్దనుకుంటే ఇంకా సంక్షిప్తంగా - (శర్మ, 1968:112) అని ఇస్తేచాలు.

వీటికి వివరణ ప్రతి అధ్యాయం చివరగాని, అనుబంధాలలో గాని ఇవ్వవలసి ఉంటుంది. అంటే అక్కడ—

శర్మ, 1968, సాహిత్య సౌందర్యము, మానససరోవర ప్రచురణలు, నెల్లూరు.

ఈ విధంగా అన్ని వివరాలూ ఇవ్వవలసి ఉంటుంది.

ఒకవేళ రచయిత పేరును మన వివరణలోనే ఇచ్చి ఉంటే బ్రాకెట్లలో ప్రచురణ సంవత్సరం, పుట సంఖ్య మాత్రం ఇస్తే చాలు. ఉదా :

వాల్మీకిలో వింతలను గూర్చి గుంటూరు శేషేంద్రశర్మగారు తమ 'షోడశి: రామాయణ రహస్యములు' అనే పుస్తకంలో చక్కగా వివరించారు (1980 : 9-15).

ఒకవేళ ఒక రచయిత పుస్తకాలు రెండు మూడు ఒకే సంవత్సరం ప్రచురింపబడి ఉంటే 1980 అ; 1980 ఆ; 1980 ఇ; 1980 ఈ అని సూచించవచ్చు.

## ఉదాహృతాలు :

పరిశోధన చేసేటప్పుడు అనేక విద్వాంసుల అభిప్రాయాలను పరిశీలించవలసి ఉంటుంది. వివిధ గ్రంథాలనుంచి విషయ సేకరణ చేసేటప్పుడు ఉన్నదున్నట్లుగా స్వీకరించేట్లయితే ఉదాహృత వాక్యాలలో రాసుకోవలసి ఉంటుందని సామగ్రి సేకరణ అనే అధ్యాయంలో చెప్పడం జరిగింది. సామగ్రి సేకరణ సమయంలో అసంఖ్యాకంగా ఉదాహృతవాక్యాలను సేకరించి భద్రపరచ

వచ్చు. కాని వాటిని సిద్ధాంత వ్యాసభాగంలో వాడుకునేటప్పుడు ఏవేవి అవసరమో చూచి అత్యవసరమనిపించే వాటిని స్వీకరించాలి.

సామగ్రి సేకరణ సమయంలోనే ఇతరుల రచనలనుంచి ఉద్ధరించిన వాటిని తప్పులు లేకుండా, విరామ చిహ్నలతో సహా వ్యత్యాసం లేకుండా రాసి ఉంచుకోవాలి.

**ఉపయోగం :-** కావలసినంతమేరకు ఉపయోగిస్తే ఉదాహృత వాక్యాల వల్ల సిద్ధాంత వ్యాసానికి బలం లభిస్తుంది. కాని, సిద్ధాంత వ్యాసంలో ఉదాహృత భాగం మరీ ఎక్కువైతే పరీక్షకులచేత తిరస్కరింపబడే ప్రమాదం కూడా ఉంది. పరిశోధకులు ఇతరుల అభిప్రాయాలను చదివి, జీర్ణించుకొని, తమదంటూ ఒక అభిప్రాయాన్ని ఏర్పరుచుకోడం చాలా అవసరం, అందువల్ల ఉదాహృతాలను మితంగా వాడడం మంచిది.

**ఉదాహృత వాక్యాలను వాడవలసిన సందర్భాలు :**

1. ఒక రచయిత అభిప్రాయాన్ని తెలపాలనుకున్నప్పుడు మనం అంతకంటే బాగా చెప్పలేమనుకుంటే ఉన్నదున్నట్లుగా చెప్పడం మంచిది.
2. ఏదైనా అభిప్రాయాన్ని మనం అంగీకరిస్తున్నా, వ్యతిరేకిస్తున్నా, విశదీకరిస్తున్నా మూలాభిప్రాయం ఇవ్వడం సమంజసమనుకుంటే ఉదాహృత వాక్యాలను వాడాలి.
3 ఏదైనా అభిప్రాయాన్ని గురించి భిన్నాభిప్రాయాలుంటే వాటిలో ముఖ్యమైన వాటిని చెప్పడానికి, మన అభిప్రాయాన్ని స్పష్టం చెయ్యడానికి ఉదాహృత వాక్యాలు అవసరమౌతాయి.
4. శాస్త్ర సంబంధమైన విషయాలను చెప్పేటప్పుడు ప్రామాణిక నిర్వచనాలను, లక్షణాలను ఉదాహృత వాక్యాలలోనే ఇవ్వాలి.

**అధస్సూచికలలో ఉదాహృత వాక్యాలు :**

అధస్సూచికలలో కూడా ఉదాహృత వాక్యాలను వాడవచ్చు. సిద్ధాంత వ్యాస భాగంలో ప్రధానరచనకు ఇవి అడ్డు వస్తాయనుకుంటే అధస్సూచికలలో

ఇవ్వాలి. అలా ఇచ్చేటప్పుడు ఉదాహృత వాక్యాలు సాధ్యమైనంత వరకు సంక్షిప్తంగా ఉండాలి. అధస్సూచికలలో ఉదాహృత వాక్యాలను ఇచ్చినప్పుడు వాటి తర్వాత ఆకరాన్ని గురించిన వివరాలను చూపవలసి ఉంటుంది. ఉదా :

---

రామాయణం భారతంకంటె అధునాతనమనే వాదాన్ని త్రోసిపుచ్చుతూ గుంటూరు శేషేంద్రశర్మ గారు చేసిన చర్చ గమనించదగింది. భారతంలో వాల్మీకి పేరు లేదని చెప్పడం సమంజసం కాదని వారు స్పష్టం చేశారు[1].

1. "భారతమున వాల్మీకి పేరు లేదు. కనుక భారతము రామాయణమున కంటె పూర్వగ్రంథ మనిరి. వాల్మీకి పేరు భారతమున అనేకమార్లు ప్రసక్తమగుట చేత దీనిని గురించి విస్తరించి చెప్పవలసిన పనిలేదు," షోడశి రామాయణ రహస్యములు, తి. తి. దేవస్థానములు, తిరుపతి, 1980, పు. 157.

---

**సిద్ధాంత వ్యాసభాగంలో ఉదాహృతవాక్యాలు :**

ఉదాహృత వాక్యాల నిడివి తక్కువగా ఉంటే ఇతర విషయాలతో బాటే ఒకే పేరాలో చేర్చవచ్చు. నాలుగు వరుసలకు మించని ఉదాహృత వాక్యాలను ఈ విధంగా చెయ్యవచ్చు. ఉదాహృత వాక్యాలను రెండు రెంపు ఉదాహృత చిహ్నాలద్వారా సూచించాలి. "........."

ఉదాహృత వాక్యాల తర్వాత రచయితను, గ్రంథాన్ని సూచించడానికి 1, 2, 3 వంటి సంఖ్యలను ఇచ్చి వివరాలను అధస్సూచికలో ఇవ్వవచ్చు. ఉదా:

"ఆదికాలపు మానవుని మొదలు నేటికాలపు మానవుని దాకా సంస్కృతి అవ్యాహతంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. గుహల్లో నివసించే పాతరాతి యుగపు మానవుడు ఒకగొప్ప శిల్పి అవడానికి ప్రత్యక్ష నిదర్శనా లున్నాయి. ఈనాటి మేటి విమర్శకులుకూడా అతనిది గొప్ప శిల్పం అని అంగీకరిస్తున్నారు."

లేదా ఈ క్రింది విధంగా ఉదాహృత వాక్యాలు పూర్తిఅయిన వెంటనే రచయిత వివరాలు ఇవ్వవచ్చు.

"అన్నిటికన్నా మిన్నగా మానవుడు యుద్ధాన్ని ఉపాసించాడు. పోరాటం అతనికి రక్తంలోనే గర్భితమైంది. పరిసరాల్తో పోరాటమేగాక, పొరుగు జాతులతో గూడా పోరాడుతూ వచ్చాడు. ఎన్నోఘన విజయాలను సాధించాడు" (శ్రీశ్రీ, 1973, పు. 65).

ఉదాహృత భాగం పెద్దదైతే—

1. ఉదాహృత చిహ్నాలను ఉపయోగించ నక్కరలేదు.
2. ఉదాహృత భాగాన్ని ప్రత్యేకమైన పేరాగ్రాఫ్‌గా రాయాలి.
3. మామూలుగా సిద్ధాంతవ్యాస భాగాన్ని డబల్‌స్పేస్‌లో టైపు చేయిస్తారు. కాని, ఈ దాహృత భాగాన్ని సింగిల్‌స్పేస్‌లో టైపు చేయించాలి.
4. మార్జిన్ దగ్గరకూడా మామూలుగా మిగిలిన విషయాన్ని రాసిన దగ్గర్నుంచి కాక మూడు అంతరాలను వదలి ఉదాహృత భాగాన్ని టైప్ చెయ్యాలి.

## గమనించాల్సిన మరికొన్ని విషయాలు :

(౧) ఉదాహృత వాక్యాల మధ్యలో మనమేదైనా చేర్చవలసి వస్తే అలాంటిదాన్ని మామూలు కుండలీకరణాంలో కాక [ ] ఇలాంటి కుండలీకరణాలను ఉపయోగించాలి. ఉదా :

"ఆనాడు మహాకవి [గురజాడ అప్పారావు] అన్న మాట ఈనాటికీ యథార్థంగానే ఉంది "

(౨) ఒకవేళ మనం ఇస్తున్న ఉదాహృత వాక్యాలలో ఏవైనా తప్పు లుంటే వాటిని దిద్ది రాసే అధికారం మనకు లేదు. అలాంటప్పుడు ఇంగ్లీషు వాక్యంలోనైతే పైన చెప్పిన కుండలీకరణాలలోనే [Sic] అని రాయవచ్చు. తెలుగులోనైతే [మూలం] అని రాయవచ్చు. అంటే మూల వాక్యం ఇలాగే ఉంది అని అర్థం. దీనివల్ల మనం ఉద్ధరించటంలో తప్పు లేదనీ, ఆ తప్పేదో మూలం లోనే ఉందనీ తెలుస్తుంది.

(౩) ఒక్కొక్కసారి ఉదాహృత వాక్యాలలోనే ఉదాహృత వాక్యాలుంటాయి అంటే మనం ఇవ్వదలచుకున్న వాక్యాలలోనే ఉదాహృత వాక్యాలుంటే ఏం చెయ్యాలన్నది సమస్య. అప్పుడు మనం ఇస్తున్న వాక్యాల్ని రెండు రెండు ఉదాహృత చిహ్నాలలో ఉంచి వాటిలో ఉండే ఉదాహృత వాక్యాల్ని ఒక్కొక్క చిహ్నంతో సూచించాలి. ఉదా :

"నేను 'తలవంచుకు వెళ్ళిపోయావా నేస్తం, సెలవంటూ ఈ లోకాన్ని వదిలి' అంటూ ఒక అంకితపు గీతం వ్రాశాను" (శ్రీశ్రీ, 1973, పు. 29-30).

(౪) ఉదాహృత వాక్యాంలో కొంత భాగాన్ని వదలివెయ్యాల్సి వస్తే ఆదిలోగాని, మధ్యలోగాని, అంత్యంలోగాని మూడు చుక్కలు (...) ఉంచాలి. వదలివేసేటప్పుడు మూల రచయిత అభిప్రాయానికి భంగం కలగకూడదు. అర్థ వ్యత్యాసం రాకూడదు.

(౫) పద్యాలను ఉదాహరించాల్సినప్పుడు కూడా కొన్ని పద్ధతుల్ని అనుసరించాల్సి ఉంటుంది.

(i) పద్యంలో ఒక పాదమో, కొన్ని పదాలో ఉదాహరించదలచుకుంటే రెండు రెండు ఉదాహృతచిహ్నాల మధ్య వాటిని ఉంచాలి. ఉదా:

తిక్కన ఉద్యోగపర్వంలో ఒకచోట "పదుమూడేడులు నీవునుం దిరిగి రాపాలీకపోవచ్చునే" (3-97) అంటాడు.

(ii) పద్యంలో రెండు మూడు పాదాలు ఉదాహరించాలంటే ఒక్కొక్క పాదం అయిన తర్వాత చిన్న నిలువు గీత ఉంచాలి. ఉదా:

"......అట్టి సంధిపెం / పార(గ నేర్చునే ? యుచితమైనది కయ్యము; వంకమాటలే/నేర(, గురుప్రవీరుసభ నిశ్చయ మిట్టిద కా(గ(జెప్పుమీ"(తిక్కన ఉద్యోగం, 3-96)

(iii) పూర్తి పద్యంగాని, కొన్ని పద్యాలుగాని, గేయాలుగాని ఉదాహరించేటప్పుడు ఉదాహృతచిహ్నాలు అక్కరలేదు. అయితే పద్యం ఉదాహరించే ముందు రెండు నిలువు చుక్కలు (:) ఉంచాలి. తర్వాత పద్యాన్నో, గేయాన్నో ఒక్కొక్క వరసమాత్రం వదుల్తూ (Single space) టైపు చేయించాలి. ఉదా:

కోలాటాలలో కూడా కొన్ని శైవగేయాలున్నాయి. శ్రీశైలమల్లేశుడు ఆంధ్రులకు, కన్నడిగులకు కూడా ఇష్టదైవం. ఒక కోలాటం పాటలో భక్తులు ఇలా కీర్తిస్తారు:

శరణూ మల్లేశ శరణూ మల్లేశ
శరణూ శ్రీశైల పర్వతాల మల్లేశ
గుడిమీద నందులన్ని గుబగుబలాడంగ
గురుతన్న కానవయ్య గురుడ మల్లేశ
ఆయో మల్లేశ బాయో మల్లేశ...
(బి. రామరాజు, 1968, పు. 91లో ఉదాహృతం)

రెండు మూడు పద్యాలుగాని, ఎక్కువ పద్యాలుగాని ఉదాహరిస్తే ఒక్కొక్క పద్యానికి మధ్య రెండు వరసల అంతరం ఉండాలి.

(iv) ఉదాహృత వాక్యాలలో కాకుండా విద్వాంసుల అభిప్రాయాలను సంక్షిప్తంగా చెప్పవచ్చు. కాని, మూలాభిప్రాయానికి విరుద్ధమైన మాటలు చెప్పి అవి ఏతద్రచయితలకు అంటగట్టకూడదు. వేరొకరి అభిప్రాయాన్ని చెప్పి నప్పుడు అది ఎవరిది, ఎక్కడిది, ఏ సందర్భంలో చెప్పిందన్నది స్పష్టం చెయ్యాలి.

ఒక్కొక్కసారి మనకు కావలసినంతమేరకు ఇతరుల అభిప్రాయాలను, ఉపన్యాసాలను, ప్రశ్నావళి సమాధానాలకు కూడా వాడుకోవచ్చు. కాని, ప్రతి చోటా ఇతరుల నుంచి పొందిన సహాయాన్ని స్మరించుకోవడం అవసరం.

ఈ విధంగా అధస్సూచికలు, ఉల్లేఖాలు, ఉదాహృత వాక్యాల విషయంలో పైన సూచించిన కొన్ని పద్ధతుల్ని అనుసరిస్తే సిద్ధాంత వ్యాసానికి పుష్టి చేకూరుతుంది.

# అనుబంధాలు

అనుబంధాలు (appendixes) అన్నవి సిద్ధాంతవ్యాసభాగం అయిన తర్వాత వచ్చేవి. ఉపయుక్తగ్రంథసూచిక కూడా ఒక అనుబంధమే కాబట్టి ఈ ప్రకరణంలోనే దానిని గురించి చెప్పడం జరుగుతుంది. ఉల్లేఖాలు కూడా సిద్ధాంత వ్యాసభాగం తర్వాత రావచ్చు.

## అనుబంధం :

అనుబంధం సిద్ధాంత వ్యాస భాగం కాగానే ఉండవచ్చు. లేదా ఉపయుక్త గ్రంథ సూచిక తర్వాత కూడా రావచ్చు. అయితే సిద్ధాంత వ్యాసభాగం కాగానే ఒక్కొక్క అనుబంధాన్ని చేర్చడం సమంజసం. ఎందుకంటే అనుబంధాలలో కూడా ఏవైనా పుస్తకాలను గురించి చెప్పవచ్చు. ఏవైనా పుస్తకాలలోని విషయాలను ప్రస్తావించవచ్చు. అందువల్ల ఉపయుక్త గ్రంథ సూచికను చిట్ట చివర ఇవ్వడమే సమంజసం.

అనుబంధాలను ఇచ్చేటప్పుడు ఒక్కొక్క అనుబంధం ప్రారంభంలో క్రింది విధంగా మధ్యలో శీర్షికను రాసి తర్వాత విషయాన్ని ప్రారంభించాలి.

**ఉదా :**

### అనుబంధం - 1

మనం రాయదల్చుకున్న అనుబంధానికి ప్రత్యేకమైన శీర్షిక ఏమైనా ఇవ్వదలచుకుంటే దాన్ని పై శీర్షిక క్రింద ఇవ్వాలి. తర్వాతి అనుబంధాలకు అనుబంధం 2, అనుబంధం 3 - ఈవిధంగా సంఖ్యలను చేర్చవలసి ఉంటుంది. అనుబంధాలలో సిద్ధాంత వ్యాసంలోని పుట సంఖ్యలనే కొనసాగించాలి. ప్రత్యేకమైన పుట సంఖ్యలు అక్కరలేదు.

ఒక్కొక్క అనుబంధం మొదటి పుటకు సంఖ్యను వేస్తే వెయ్యవచ్చు లేక మానెయ్యవచ్చు. సంఖ్యను వేసేట్లయితే మామూలుగా కాకుండా పుట అడుగున, మధ్యలో సంఖ్య వెయ్యాలి. అంతే కాని మామూలుగా వేసేట్లు పుటకు పై భాగాన కుడి వైపున వెయ్యకూడదు.

## అనుబంధాలలో చేర్చదగ్గవి :

సిద్ధాంతవ్యాసంలోని ప్రధాన భాగంలో చేర్చలేనివి మాత్రమే అనుబంధాలలో చేరుస్తామన్నది స్పష్టమే. ప్రధాన వ్యాస భాగంలో చేర్చడానికి వీలులేని పట్టికలు మొదలైనవి అనుబంధాలలో చేర్చాలి. తను చేసిన పరిశోధనకు సంబంధించిన ప్రణాళికను గురించి సుదీర్ఘంగా చెప్పవలసి ఉంటే దాన్ని అనుబంధంలో చేర్చాలి. పరిశోధన సమయంలో ప్రశ్నావళి వంటి వాటిని తయారుచేసి ఉపయోగించి ఉంటే వాటినీ అనుబంధంలో చేర్చాలి. ఉదాహృత భాగాలేవైనా దీర్ఘమైనవి ఉంటే వాటిని అనుబంధంలో చేర్చాలి. ప్రధాన భాగంలో చిన్న చిన్న ఉదాహృత వాక్యాలు ఇవ్వవచ్చు గాని పుటల కొద్దీ సమాచారాన్ని ఉదాహృతంగా ఇవ్వకూడదు. కాని, అలాంటివి ఇవ్వక తప్పని పరిస్థితి ఏర్పడితే అనుబంధంలో చేర్చాలి. పరిశోధన జానపద విజ్ఞానం, భాషా శాస్త్రం వంటి విషయాలకు సంబంధించినదైతే నివేదకుల వివరాలు మొదలైనవి అనుబంధంలో ఇవ్వాలి. అలిఖిత సంబంధమైన ఆధారాలను అనుబంధంలో చేర్చవలసి ఉంటుంది. సులభంగా దొరకని నివేదికలు, దస్తావేజులు, ఆధార పత్రాలు మొదలైనవి కూడా అనుబంధంలో చేర్చదగ్గవి.

## గమనించవలసిన మరికొన్ని అంశాలు :

అనుబంధాలను చేరుస్తున్నాం కదా అని అనవసరమైనవీ, అనుచితమైనవీ, అనుపయుక్తమైనవన్నీ పరిశోధన గ్రంథంలో చేర్చగూడదు. సిద్ధాంత భాగంలో చేర్చడం మంచిదా, అనుబంధంలో చేర్చడం మంచిదా అన్నదాన్ని ఒకటికి రెండుసార్లు ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. అనుబంధంలో చేర్చిన విషయంవల్ల పరిశోధకుని ప్రతిపాదన బలహీనమవుతున్నదా అన్నది పరిశీలించాలి. అనుబంధాన్ని గురించి సిద్ధాంతవ్యాసంలో ఎక్కడైనా సూచించడం జరి

గిందా అన్నది గుర్తుపెట్టుకొని దానికి తగ్గట్లుగా అనుబంధాన్ని ఇవ్వాలి. అనుబంధంలో తప్పక ఇవ్వాలి అనుకున్న వాటినిగురించి చెప్పేటప్పుడు —

ఈ విషయాన్ని గూర్చిన వివరాలకు
చూడండి : అనుబంధం 1

అని ఇవ్వవలసి ఉంటుంది. ఇలాంటివన్నీ ఒకచోట రాసిపెట్టుకొని ఆయా అనుబంధాలలో చేర్చుకోవాలి.

అనుబంధాలలో మామూలుగా సిద్ధాంత వ్యాసవిషయానికి పోషకాలైన అంశాలను చేరుస్తాం కాబట్టి, అవి మామూలుగా వ్యక్తులకు సంబంధించినవి కాబట్టి ఒక్క అక్షరమూ పొల్లుపోకుండా చూసుకోవాలి, ముఖ్యంగా ఉదాహృత భాగాలను ఇచ్చేటప్పుడు, పట్టికలు, పేర్లు, సంఖ్యలు వగైరాలు ఇచ్చేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. అసలు అనుబంధం చదివితే సిద్ధాంత వ్యాసభాగంతో దాన్ని అనుసంధించుకోవడం సాధ్యమవుతుందా అన్నదాన్ని పరిశీలించాలి. ఈ విధంగా అనుసంధించుకోవడం క్లిష్టమయ్యేట్లయితే అనుబంధానికి కొంత వివరణను జోడించాలి.

ఒక్కొక్క అనుబంధాన్ని కొత్తపుటలో ప్రారంభించాలి. అనుబంధాలు ఎన్ని ఉంటే అన్నిటినీ పుటసంఖ్యలతో సహా విషయసూచికలో ఇవ్వాలి.

## ఉపయుక్త గ్రంథసూచిక :

సిద్ధాంత గ్రంథంలో జాగ్రత్తగా, తప్పులు లేకుండా, సరైన వివరాలతో ఇవ్వవలసిన వాటిలో ఉపయుక్త గ్రంథ సూచిక ఒకటి.

ఏ గ్రంథం రాయాలన్నా ఇతర గ్రంథాల సహాయం తప్పనిసరి. స్వీయ మేధాశక్తితో గ్రంథరచన సాధ్యమైనా సిద్ధాంతగ్రంథరచనకు ఉపజీవికా గ్రంథాలు ఉండి తీరుతాయి. సిద్ధాంత గ్రంథరచనకోసం తాను ఉపయోగించుకొన్న గ్రంథాలన్నింటిని పట్టికరూపంలో ఇవ్వడం పరిశోధకుని కర్తవ్యం.

ఇంగ్లీషులోని Bibliography అన్నదానికి ఉపయుక్త గ్రంథసూచిక అని అర్థం చెప్పుకోవచ్చు. లిఖిత రూపంలో ఉండే అన్ని ఆధారాలను ఇక్కడ చేర్చాలని సామాన్యార్థం. ముద్రితమైన ఆధారాలనే కాకుండా అముద్రిత సిద్ధాంత గ్రంథాలవంటి వాటినికూడా ప్రత్యేకంగా ఈ సూచికలో చేర్చవచ్చు. సిద్ధాంత వ్యాసంలోని ప్రధాన భాగంలో ఉల్లిఖితమైన అన్ని ఆధారాలను, అధస్సూచికల్లో పేర్కొన్న ఆధారాలను ఈ సూచికలో చేర్చవలసి ఉంటుంది. వాడుకొన్న ఆధారాల వైవిధ్యాన్నిబట్టి, విస్తృతినిబట్టి ఒకే సూచికలోగాని, ఉపసూచికల్లోగాని ఆధారాలను ఇవ్వవలసి ఉంటుంది.

ఉపయుక్త గ్రంథసూచికలో ముఖ్యంగా గ్రంథరచనకు ఉపయోగించిన గ్రంథాలను మాత్రం ఇవ్వడం సామాన్యంగా అనుసరించే పద్ధతి. అంటే సిద్ధాంత వ్యాసంలో ఉల్లిఖితమైనవి, అధస్సూచికల్లో, పేర్కొన్నవి మాత్రం ఇవ్వడమన్నమాట. దీనినే ఇంగ్లీషులో Works cited అనిగాని, List of References అనిగాని ఇస్తుంటారు.

## ఉపయుక్త గ్రంథసూచిక

అన్నదానిని పై విధంగా ఏ విధమైన విరామచిహ్నాలనూ వాడకుండా పుట మధ్యభాగంలో, క్రింద గీతలేకుండా రాయాలి. అనుబంధాలు కాగానే తరువాతి పుటలో ఉపయుక్త గ్రంథసూచిక అన్నదాన్ని ప్రత్యేకంగా ఒక పుటలో రాసి తర్వాతి పుట వదలి గ్రంథాల పట్టికను ఇవ్వడం బాగుంటుంది. వేరు వేరు భాషలకు సంబంధించిన గ్రంథాలుంటే ఒక్కొక్కదాన్నీ వేరువేరుగా ఇవ్వాలి.

కొందరు సంప్రదించిన ఆధారగ్రంథాల పట్టికను ఇస్తుంటారు. అంటే సిద్ధాంతగ్రంథంలో ఉల్లిఖితాలైన గ్రంథాలనే కాకుండా, దాన్ని తయారు చేసే టప్పుడు సంప్రదించిన అన్నిరకాల గ్రంథాలనూ చేర్చి ఈ పట్టికను తయారు చేస్తారు.

మరికొందరు టిప్పణితో గూడిన ఆధార గ్రంథసూచికను ఇస్తారు. దీనిలో ఆయా గ్రంథాలలో విషయం, అవి తన కెంతవరకు ఉపయోగపడిందనే విషయాన్ని చాలా సంక్షిప్తంగా తెలియపరచడం జరుగుతుంది.

ఇటీవలి కాలంలో ప్రధానాధార గ్రంథాలు, అప్రధానాధార గ్రంథాలు - ఈ విధంగా విభజించే అలవాటు కనిపించడం లేదు. అన్నిటినీ కలిపి ఒకే ఉపయుక్త గ్రంథ సూచికను ఇవ్వడమే పరిపాటి అయింది. కాని, పత్రికలు, వ్రాతప్రతులు మొదలైన వాటిని ప్రత్యేకంగా ఇవ్వడం మంచిది. అన్నిటినీ కలగాపులగం చేస్తే గందరగోళంగా ఉంటుంది.

ఉపయుక్త గ్రంథ సూచికలో అనుసరించాల్సిన క్రమానికి ప్రామాణికపద్ధతంటూ ఏదీ లేదు. పరిశోధన పద్ధతుల్ని గురించి గ్రంథాలను వ్రాసిన వారు అనేక పద్ధతుల్ని సూచించడం జరిగింది. 'ఇదే పద్ధతి అనుసరించాలి' అనే నియమ మేదీ లేదు. అధస్సూచికల విషయంలో పాటించిన నియమాలనే ఇక్కడ కూడా పాటించవచ్చు. అయితే సాధ్యమైనంత వరకు ఇచ్చే వివరాలు నిర్దుష్టంగా, స్పష్టంగా ఉండేట్లుగా చూచుకోవాలి.

ఉపయుక్త గ్రంథసూచిక మక్కికి మక్కి అధస్సూచికల్లాగా ఉండదు. అధస్సూచికలో ముందు ఇంటిపేరు లేక ఇంటిపేరుకు సంబంధించిన పొడి అక్షరాలు ఉంటాయి. ఆ తర్వాత అసలు పేరు ఉంటుంది. కాని, ఉపయుక్త గ్రంథ సూచికలో అలా ఇవ్వకూడదు. ముందు అసలు పేరు ఇచ్చి, ఆ తర్వాత ఇంటి పేరు, లేక తత్సంబంధమైన పొడి అక్షరాలను ఇవ్వాలి.

**పేరు రాసే తీరు :** మొదట పేరు, తర్వాత ఇంటిపేరు రాయాలని చెప్పడం సులభం కాని తెలుగులో ఈ పని చేయడానికి అనేక సమస్యలు అడ్డు వస్తాయి. పేరు, ఇంటిపేరు సరళ సుందరంగా ఉన్నవారి విషయంలో ఏ ఇబ్బందీ లేదు.

సుబ్బారావు, రాయప్రోలు
లక్ష్మీకాంతం, పింగళి

పేరుతో కలిసిపోయిన రావు, శాస్త్రి, శర్మలాంటి వాటిని వేరుచేసి అకారాదిగా కూర్చుతాడు. ఉదా : సుబ్బారావు, కృష్ణశాస్త్రి, అనంతకృష్ణశర్మ మొదలైనవి. కాని, గ్రంథకర్తే అలాంటివాటిని ప్రధానంగా ప్రచురించుకొని వుంటే అప్పుడు అలాగే ఉపయుక్త గ్రంథ సూచికలో తీసుకోవాలి. ఉదా :

శర్మ, సి. ఆర్.

పేరు తర్వాత కామా, ప్రతి పొడి అక్షరం తర్వాత ఒక ఫుల్‌స్టాప్ ఉండాలి.

తెలుగువారి పేర్లలో 'వేంకట' ఉండడం తరచుగా కనిపిస్తుంది. ఇది సంధిగా వస్తే తప్ప మిగిలిన చోట అసలు పేరును మాత్రం ఇచ్చి, ఇంటిపేరును, వేంకట, వీర, సుబ్బు మొదలైన ఉపనామాలను తర్వాత రాయాలి. ఉదా :

సుబ్బారావు, తంగిరాల వెంకట
సుందరం, రాళ్ళపల్లి వెంకట సుబ్బు

సంధిగా కలిసిపోయినప్పుడు చేర్చి రాయాలి. ఉదా :

వేంకటావధాని. దివాకర్ల
వేంకటాచలపతి, గరిమెళ్ళ

తెలుగువారి పేర్లలో సుబ్బారావు, సత్యనారాయణ, వేంకటేశ్వర్లు మొదలైనవి అధికసంఖ్యలో కనిపిస్తాయి. అలాంటప్పుడు అకారాది పట్టికలో ఎవరిపేరు ముందురావాలని అనుమానం వస్తుంది. అలాంటప్పుడు ఇంటిపేరును బట్టి పేర్లను అకారాదిగా కూర్చాల్సి ఉంటుంది.

సుబ్బారావు. నాయని
సుబ్బారావు, రాయప్రోలు

ఒకే రచయిత రాసిన అనేక గ్రంథాలను ఇవ్వవలసి ఉంటే ప్రచురించిన సంవత్సరాల క్రమాన్ని బట్టి ఇవ్వాలి.

మనం ఇస్తున్న పేరు రచయితకు సంబంధించింది కాక సంపాదకునికో, సంకలనకర్తకో, అనువాదకునికో సంబంధించిందైతే ఆ విషయాన్ని కుండలీకరణాల్లో సూచించాలి.

ముద్దుకృష్ణ (సం.)
సుబ్బారావు, గొల్లపూడి (సంక.)
భానుమూర్తి, వారణాసి (అను.)

**ఇతర వివరాలు :** ఉపయుక్త గ్రంథసూచికలో రచయిత పేరుగాక ఇంకా అనేక వివరాలను ఇవ్వవలసి ఉంటుంది. వీటిలో ముఖ్యంగా గ్రంథం పేరు, ప్రచురణకర్త పేరు, ప్రచురణ స్థలం, సంవత్సరం తప్పక ఇవ్వాలి. ఇంగ్లీషు పుస్తకాల్లో ఈ క్రింది విధంగా వివరాలను పొందుపరుస్తుంటారు.

Kitson Clark, G. 1960. Guide for Research Students Working on Historical Subjects. Cambridge : Cambridge University Press.

మొదట పేరు, తర్వాత కామా, పొడి అక్షరం, సంపూర్ణ విరామం, సంవత్సరం, సంపూర్ణ విరామం, పుస్తకం పేరు (క్రింద గీత), సంపూర్ణ విరామం, ప్రచురణస్థలం, కోలన్, ప్రచురణకర్త పేరు, చివర సంపూర్ణ విరామం.

దీనినే ఇంకా మరికొన్ని మార్పులతో సామాన్యంగా అనుసరిస్తూ ఉంటారు.

తెలుగులో పాశ్చాత్య విధానాన్ని అలాగే అనుసరించాల్సిన అవసరం లేదు. మొత్తం మీద అన్ని వివరాలనూ సక్రమంగా ఇవ్వాలి. అధస్సూచికల్లో పుస్తకం పూర్తి పేరు ఇవ్వకపోయినా పర్వాలేదు గాని, ఉపయుక్త గ్రంథసూచికలో పూర్తి వివరాలు ఇవ్వాలి. ఈ క్రింది విధంగా ఆ వివరాలను ఇవ్వవచ్చు :

సర్వోత్తమరావు, కె., దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలన, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1966.

ఒకవేళ పరిశోధకుడు హార్వర్డు ఉల్లేఖ విధానాన్ని అనుసరించి ఉంటే (చూ. అధస్సూచికలు - ఉల్లేఖాలు - ఉదాహృతాలు అధ్యాయంలో ఉల్లేఖాలు) ఉపయుక్త గ్రంథ సూచికలో వివరాలను ఈ క్రింది విధంగా ఇవ్వాలి.

సర్వోత్తమరావు, కె., 1966, దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలన, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

గ్రంథకర్త పేరుకు, గ్రంథం పేరుకు మధ్య సంవత్సరం రావాలి. ఒకే సంవత్సరం గ్రంథకర్త రచన లనేకం ప్రచురింపబడి ఉంటే 1986 అ, 1986 ఆ, 1986 ఇ, 1986 ఈ — ఇలా ఇవ్వాలి. సిద్ధాంత వ్యాసంలో వీటిని ఇచ్చే టప్పుడు ఈ క్రింది విధంగా ఇచ్చి ఉంటామనే విషయం గమనించాలి.

(కె. సర్వోత్తమరావు, 1986 : 150)

మనం సంప్రదించిన గ్రంథాలను గురించి సంక్షిప్త వివరాలను ఇవ్వ దలచుకుంటే ఈ క్రింది విధంగా ఇవ్వవచ్చు (డా॥ పి. ఎస్. సుబ్రహ్మణ్యం గారి ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి, హైదరాబాదు, 1984 నుంచి).

Bloomfield, Leonard. 1933. Language. New York: Holt. భాషా శాస్త్రజ్ఞులకి పరమ ప్రమాణమైన గ్రంథా లలో ఇది ముఖ్యమైనది. భాషాశాస్త్రంలో అన్ని శాఖల లోనూ 1933 వరకూ జరిగిన పరిశోధనా ఫలితాలని సమగ్రంగా వివరిస్తుంది. సులభశైలిలో సమగ్ర చర్చా, విభిన్న భాషలనుంచి ఉదాహరణలూ దీనిలో ప్రత్యేకతలు.

Bynon, Theodora. 1977. Historical Linguistics. Cambridge: Cambridge University Press. చారిత్రక భాషాశాస్త్రానికి ఇది ఒక మంచి ప్రవేశక గ్రంథం.

Gardona, George. 1976. (Indian reprint 1980). Panini, A Survey of Research. The Hague: Mouton. ఇందులో పాణిని అష్టాధ్యాయిపై ఇంతవరకూ జరిగిన పరిశోధన సమీక్షే కాక అష్టా ధ్యాయిపై వచ్చిన పరిశోధన గ్రంథాల, వ్యాసాల సమగ్ర పట్టిక ఉంది.

ఉపయుక్త గ్రంథ సూచికను గురించిన వివరాలను ఇంతటితో నిలిపి, సిద్ధాంత గ్రంథాన్ని తయారు చెయ్యడంలో తీసుకోవలసిన ఇతర జాగ్రత్తలను గురించి పరిశీలిద్దాం.

# తుది మెరుగులు

ఉపయుక్త గ్రంథ సూచికతో సహా అన్నీ పూర్తిచేసిన తర్వాత సిద్ధాంత గ్రంథం చాలావరకు తయారైనట్లే. విశ్వవిద్యాలయానికి సిద్ధాంత గ్రంథాన్ని సమర్పించే ముందు కొన్ని తుది మెరుగులు దిద్దాల్సి ఉంటుంది. వీటిలో ముఖ పత్రం, పీఠిక, అక్షర సంకేతాల పట్టిక ముఖ్యమైనవి.

## ముఖ పత్రం :

ముఖపత్రం సరళ సుందరంగా ఉంటే బాగుంటుంది. పుస్తకాన్ని అచ్చు వేసుకునేటప్పుడు రంగులు హంగులు ఎన్నైనా ఉండవచ్చు. కాని, పరిశోధన గ్రంథాన్ని పరీక్షకుల పరిశీలనకు పంపేటప్పుడు హంగులకన్న విషయం, విశ్లేషణ ప్రధానమనే విషయం గుర్తుంచుకోవాలి. ముఖపత్రం మీద ఉండాల్సిన ముఖ్య విషయాలు :

1. సిద్ధాంత వ్యాస శీర్షిక
2. ఏ డిగ్రీకోసం ఏ విశ్వవిద్యాలయానికి సమర్పిస్తున్నది
3. పరిశోధకుని పేరు
4. సమర్పిస్తున్న సంవత్సరం

విశ్వవిద్యాలయంలో పరిశోధన విషయం నమోదు చేసుకునేటప్పుడు శీర్షిక ఎలా ఉందో అది ఒక్క అక్షరమూ పొల్లుబోకుండా ముఖపత్రంమీద ఉండాలి. డిగ్రీ, విశ్వవిద్యాలయం పేరు తప్పకుండా ఉండాలి. పరిశోధకుని పేరుకూడా తప్పకుండా ఉండాలి. ఏ అధ్యయనశాఖలో సమర్పిస్తున్నది చెప్తే చెప్పవచ్చు. సంవత్సరంతోబాటు నెలనుకూడా ఇస్తే ఇవ్వవచ్చు. ఇటీవల కొందరు పర్యవేక్షకుని పేరుకూడా ముద్రిస్తున్నారు. ఇది మంచిపద్ధతి కాదు. ఈ పద్ధతిని వదలి వేయడం మంచిది.

ముఖపత్రం నమూనా :

కాటమరాజు కథల
సాంస్కృతిక అధ్యయనం

వి. వి. భానుమూర్తి

పిహెచ్. డి., పట్టంకోసం మైసూరు విశ్వవిద్యాలయానికి
సమర్పించిన సిద్ధాంత గ్రంథం

1986

పీఠిక :

ఇది వీలయినంత సంక్షిప్తంగా ఉండాలి. ఇందులోనే కృతజ్ఞతలను కూడా చేర్చవచ్చు. పీఠిక - ముందుమాట - తొలిపలుకు - కృతజ్ఞతను ఇలాంటి శీర్షికలు ఉంచి నాలుగు మాటలు చెప్పడం మామూలుగా కనిపిస్తుంది. పర్యవేక్షకుని గురించి అతిగా రాయడం. విపరీతంగా పొగడడం పరిశోధన గ్రంథాలలో పనికి రాదు. పరిశోధకుడు తన పరిశోధన ఉద్దేశం, అనుసరించిన విధానాలు, ప్రయత్నాలు, ఫలితాలు మొదలైన వాటిని గురించి రెండు మాటలు చెప్పి ముగించడం మంచిది.

ఒకవేళ ప్రవేశికలోనో, ప్రథమాధ్యాయంలోనో చెప్పవలసిన విషయాలన్నీ చెప్పి ఉంటే, మళ్ళీ పీఠిక రాయాల్సిన అవసరం లేదు. అలాంటప్పుడు 'కృతజ్ఞ

తలు' అన్న పేరుతో ఒకపుటకు మించకుండా రాస్తే చాలు. కృతజ్ఞతలలో అన్నలు, తమ్ముళ్ళు, స్నేహితులు, శ్రీమతి మొదలైన వారందరినీ చేర్చే అలవాటు కొందరికి ఉంది. ఇలా అందరి పేర్లూ తప్పక చేర్చాలనే పట్టుదల పెట్టుకోకుండా పరిశోధన సమయంలో సహాయపడిన వ్యక్తులకు, సంస్థలకు కృతజ్ఞతలు చెప్పి ముగించాలి. ధన్యవాదాలు చెప్పాల్సిన వారు ఎక్కువమంది లేకుంటే 'కృతజ్ఞతలు' అన్న శీర్షిక అక్కరలేదు. పుట మధ్యభాగానికి కొద్దిగా పైన ఒక పేరాగ్రాఫ్‌లో ధన్యవాదాలు సమర్పిస్తే చాలు. మొత్తం మీద పరిశోధన గ్రంథంలోని ఈ భాగం సంక్షిప్తంగా, సరళంగా ఉండాలన్నది స్పష్టం.

## విషయసూచిక :

సిద్ధాంత గ్రంథంలోని ప్రధాన విభాగాలను విషయసూచికలో సూచించడం జరుగుతుంది. అధ్యాయాల కిచ్చిన శీర్షికలు ఒక్క అక్షరంకూడా మార్పులేకుండా విషయసూచికలో చేర్చాలి. పుటసంఖ్యలను కూడా తప్పుల్లేకుండా సరిచూచి వెయ్యాలి.

విషయసూచిక సిద్ధాంత గ్రంథంలోని అధ్యాయాలను స్థూలంగా పరిచయం చెయ్యడమే కాక అవి ఎక్కడెక్కడ ప్రారంభమౌతాయో తెలుపుతుంది. అధ్యాయాలలోని విభాగాలను విషయసూచికలో చూపితే చూపవచ్చు లేదా వదిలేయవచ్చు. అలాగే కృతజ్ఞతలు, పీఠిక మొదలైన వాటిని గూడా విషయసూచికలో చూపితే చూపవచ్చు. ఒకవేళ చూపితే వాటికి పుటసంఖ్యలు వేరుగా ఇవ్వవలసి ఉంటుంది.

విషయసూచికలో ప్రధానాధ్యాయాలకు మాత్రం సంఖ్యలను వేసి ఒకటవ అధ్యాయం, రెండవ అధ్యాయం అని సూచించవలసి ఉంటుంది. అధ్యాయంలోని ఉపవిభాగాలకు ఆ విధంగా సంఖ్యలను వేయవలసిన అవసరం లేదు.

ఉదా :

### విషయసూచిక

## ఉపసహారం :

సిద్ధాంతవ్యాసం అన్నది ఉన్నత విద్యార్హత గల విద్యార్థి ఒక పద్ధతిలో ఆలోచించి తయారుచేసే ఉన్నత ప్రమాణాలు గల గ్రంథం. అందువల్ల పరిశోధకుడు అంతర్జాతీయ ప్రమాణాలను అనుసరించడం అవసరం. సిద్ధాంత వ్యాసాలను పరిశీలించి విలువకట్టే పరీక్షకులలో ఒక్కరైనా విధిగా విదేశాలకు చెందిన వారుండాలనే నియమం కొన్ని విశ్వవిద్యాలయాల్లో ఉంది. పరిశోధన పద్ధతులను అనుసరించి ఉత్తమ సిద్ధాంత వ్యాసాన్ని తయారుచేస్తే అది ప్రపంచంలో ఎక్కడైనా ఆమోదయోగ్యంగానే ఉంటుంది. తెలుగువారు కూడా ఇలాంటి ఉన్నత ప్రమాణాలను సాధించాలని ఆశిద్దాం. వస్తు సంబంధమైన, శైలీ సంబంధమైన, పరిశోధన సంబంధమైన ప్రమాణాలతో బాటు పద్ధతులకు సంబంధించిన ప్రమాణాలను కూడా కాపాడడం మన కర్తవ్యం.



Cover Printed at Nandini